# ముున్నుడి

*ఓం.. శ్రీ గురుభ్యోనమః*
*కూజంతం రామ రామేతి*
*మధురం మధురాక్షరం*
*ఆరుహ్య కవితా శాఖాం*
*వందే వాల్మీకి కోకిలం*

కవిత్వం అనేటటువంటి కొమ్మనెక్కి రామ రామ అనే తియ్యటి పలుకులను కమ్మగ పలికినటువంటి వాల్మీకి అనే కోకిలకు నమస్కారం చేస్తున్నాను.

వేదములచేత మాత్రమే తెలుసుకోదగిన పరమపురుషుడు దశరథ కుమారుడైనటువంటి శ్రీరామచంద్రప్రభు. వేదం వాల్మీకి ముఖమునుండి సాక్షాత్తుగా రామాయణ స్వరూపంతో వెలసింది. అందుకనే ఎంతవరకైతే గిరులు, ఝురులు, ఎరులు, తరులు అలా వుంటూ వుంటాయో అంతవరకు ఆచంద్ర తారార్కం రామ కథ ప్రవచనం జరుగుతూనే ఉంటుంది. రామకథను వివిధ రూపాల్లో కవులు వ్రాస్తూనే ఉంటారు. ఆదికవి వాల్మీకి త్రేతాయుగంలో ఆవిర్భవించాడు. వరుణుదేవుడు యొక్క పదిమంది పుత్రులలో ఆయన దశమపుత్రుడు.

రామనామాన్ని జపించి తనచుట్టూ వల్మీకాలు రూపొందించిన వల్మీకాలు వృద్ధి పొందినా కూడా తపస్సును కొనసాగించినటువంటి మహానుభావుడు సాక్షాత్తు బ్రహ్మదేవుడు చేత యితః ప్రభూతి తం వాల్మీకి భవ అని అనిపించుకున్నవాడు. వల్మీకంలలోంచి ఆవిర్భవించాడు

బ్రహ్మ తేజస్సుతోటి. అలాంటి రత్నాకరుడుయొక్క పునర్జన్మ, ఆర్ష జన్మ వాల్మీకత్వం. అందుకనే ఆయన నోట వేదం రామకథగా అవతరించింది. నారదమహాముని ఉపదేశాన్ని పొందిన వాల్మీకి రామకథను 24 వేల శ్లోకాలుతో, 7 కాండలతో అద్భుతంగా మనకు అనుగ్రహించాడు.

వాల్మీకి యొక్క మొహపదం నుండి వెలువబడిన రామాయణం అనే మకరందాన్ని ఎవరైతే చెవులారా వింటారో వాళ్ళకు జన్మదుఖం, జరా దుఃఖం, వ్యాధి దుఃఖం, మరణ దుఃఖం ఇవి ఏవీ ఉండవు. సంతోషంగా చివరిక్షణం వరకు జీవిస్తారు రామానుగ్రహంతో. తర్వాత రామతారక మంత్రాన్ని జపిస్తూ.. మోక్షం పొందుతారు. అలాంటి రామకథ సంస్కృతంలో 22 రూపాలుగా ఆవిర్భవించింది. 22 సంస్కృత రామాయణాలు. అన్నిటికీ ప్రమాణం వాల్మీకి రామాయణం. తర్వాత విశేషమైన ప్రామాణిక రామాయణం ద్వాపర యుగంలో వ్యాసులవారు రచించినటువంటి బ్రహ్మాండ పురాణంలో వున్న పార్వతీ పరమేశ్వర సంవాద రూప ఆధ్యాత్మ రామాయణం. అవి కాకుండా ఆనంద రామాయణం, విచిత్ర రామాయణం, హనుమద్రామాయణం, వశిష్ఠ రామాయణం, రామతీర్థ మానసం ఇలాంటివి ఎన్నో వచ్చాయి. ఇంక తెలుగులో చూసినట్లయితే 64 పద్య రామాయణాలు వున్నాయి. గద్య రామాయణాలు 20 ఉన్నాయి. జానపద రామాయణాలు 60 ఉన్నాయి. ఇక విదేశీ, స్వదేశీ భాషలలో అనేక రామాయణాలు. ఇంక ప్రత్యేకంగా రంగనాథ రామాయణం ద్విపద, మొల్ల రామాయణం. తిక్కన నిర్వచనోత్త

రామాయణం, భాస్కర రామాయణం ఇన్ని ఉన్నాయి. అయినా కవులు వ్రాస్తూనే ఉన్నారు కదా. మరి ఇప్పుడు మరొక ప్రసిద్ధ రచయిత్రి, కవయిత్రి ఎంతో పూర్వజన్మ పుణ్య వశంతో ఆమె ద్విపద కావ్యం వ్రాశారు. ఎంతో అద్భుతమైనటువంటి, ఎప్పుడో రంగనాథ రామాయణం ద్విపదగా ఆవిర్భవించింది. ఇప్పుడు లలితకళ గారు అద్భుతంగా మనకు ఈ ద్విపద రామాయణం అనుగ్రహించారు. ఆమెకు స్వామివారి దివ్యానుగ్రహం లభించునుగాక.

అంతేకాదు ఉపనిషత్తులలో సీతోపనిషత్తు, శ్రీరామదానోప నిషత్తు, ముక్తికోపనిషత్తు ఇలాంటి ఉపనిషత్తులలో కూడా రామకథ ఉంది. పురాణాలలో ఉంది. పద్మపురాణంలో ఉంది. అలాంటి పౌరాణోక్త మైన విషయాలే కాకుండా అది ఒక ఇతిహాసంగా త్రేతాయుగ చరిత్రే రామకథ. ద్వాపరయుగ చరిత్రే కృష్ణకథ. అలాంటి రామయణాన్ని ద్విపద రామాయణంగా అనుగ్రహించారు. ఆ కవయిత్రి సోదరి లలితకళ గారికి స్వామివారి దివ్యానుగ్రహం కలుగునుగాక. వారు సకుటుంబంగా రామానుగ్రహం పొందుతూ, ఇలాగే ఇంకా మంచి మంచి కావ్యాలను వ్రాయాలని, అలా వ్రాయగలిగే అద్భుతమైన శక్తిని శ్రీరామచంద్ర ప్రభువు ప్రసాదించాలని అని భావిస్తూ.. స్వస్తి.

**- శ్రీ మైలవరపు లక్ష్మీ నరసింహారావు**

## ‘లలిత’ లలిత పదబంధురం - ‘రామరసం’

రామాయణం ఆదికావ్యం. రసభరితం. భారతదేశంలో, హిందువుల హృదయాలలో రామాయణ కావ్యానికి, సీతారాములకి విశిష్టమైన స్థానం వుంది. ఆదికవి వాల్మీకి విరచితమైన రామాయణ కావ్యం వేలాది సంవత్సరాలుగా మన జీవితాలలో, సంస్కృతీ సంప్రదాయాలలో మమేకమైపోయింది. రామాలయం లేని ఊరు, రాముడుని తలవని రోజు మనకు ఉండవంటే అతిశయోక్తి కాదు.

అంతటి మహిమాన్వితమైన రామాయణ మహాకావ్యాన్ని నా సోదరి శ్రీమతి మున్నంగి లలితకళ ద్విపద కావ్యంగా రాయడానికి సంకల్పించిన విషయం తెలిసి నేనెంతో సంతోషించాను. తన జీవిత పూర్వాశ్రమంలో అధ్యాపకురాలుగా పనిచేసి విద్యాబోధన చేసిన ఆమె తన మలిదశలో ఆధ్యాత్మిక రంగాన్ని ఎంచుకొని, భక్తి సంబంధమైన ఎన్నో కావ్యాలను, భగవత్సంబంధమైన కథలను పరిచయం చేస్తూ ప్రజలలో ఆధ్యాత్మిక అనురక్తిని పెంచే విధంగా ఎంతో కృషి చేస్తున్నది.

తెలుగుభాష తన ప్రాభవాన్ని కోల్పోతూ, పుస్తక పఠనం మరీ ముఖ్యంగా కావ్య పఠనం మృగ్యమైపోతున్న ఈ రోజుల్లో రామాయణ కావ్యాన్ని ద్విపద కావ్యంగా రచించడం సాహసమైతే సరళమైన పదాలతో సులభసుందరంగా భక్తిరసబంధురంగా ఆమె రచించిన తీరు ఆదర్శనీయం. లలితమైన పదాలతో ఆమె అందించిన అతులిత కవితా మాధుర్యాన్ని తెలుగు తెలిసిన ప్రతివారూ ఆస్వాదించగలరు. రామాయణంలో పెద్ద పెద్ద వ్యాక్యాల్లో వివరించవలసిన ఎన్నో సంఘటనలు, ఘట్టాలు ఆమె రచనా చమత్కృతిలో, చిన్న చిన్న పదాలలో

లలితంగా ఒదిగిపోయి కావ్యాన్ని పఠన సులభం చేసి జనరంజకంగా నిలిపాయి. ఈ విధగా ఆమె రచనా రంగంలో ఒక నూతన ఒరవడిని సృష్టించారు. ఆమె రచనా నైపుణ్యానికి మచ్చుతునకలుగా నిలిచిన కొన్ని పద్యాలను కింద ఉదహరిస్తాను.

ఇష్టదేవతా ప్రార్ధనలో శివప్రార్ధన చేస్తూ రచయిత్రి..

*'హస్తాన నిన్నుంచి అర్చించునట్టి*
*భాగ్యమ్ము నాదేను భవములు బాపు.'*

ఈ పద్యంలో మహాదేవుణ్ణి చేతిలో వుంచుకొని అర్చించటం కంటె మహాభాగ్యం ఏం వుంటుంది అది వివరించిన తీరు ఆమె భక్తి తత్పరతను తెలియచేస్తుంది.

బాలకాండలోని సీతాస్వయంవరం సమయంలో

*'జనకుని కొలువులో జనులు మెచ్చంగ*
*నిటలాక్షు విలుద్రుంచె నీరజాక్షుండు'*

సీతాకళ్యాణ సమయంలో

*'ముత్యాల తలంబ్రాలు ముచ్చట లొలుక*
*నీలాలుగా మార్చె నేలయల్లుండు'*

అయోధ్యకాండలో గుహుడు రాముని నదిదాటించే సందర్భంలో

*'భవములు దాటించు భగవంతు తాను*
*దాటించి గుహుడెంతో ధన్యుడాయెనుగా'*

సుందరకాండలో శ్రీరాముడు మరువగాలేనయ్య మారుతి అంటూ శ్రీరాముడు హత్తుకున్న సందర్భంలో

ఫలితముదొరుకగా పావనియపుడు
ఉదధియై ఉప్పొంగి ఉత్సాహమందె.

ఈ కావ్యంలో ఇటువంటి ఎన్నో పాదాలు ఈమె రచనా చమత్కృతికి మచ్చుతునకలుగా నిలిచాయి.

ఈ రచయిత్రి రామాయణాన్ని రచించిన నేపథ్యం చూస్తే... ఒక చక్కటి సమాజ నిర్మాణానికి కావాలసిన ఉత్తమ సంస్కారం కుటుంబ వ్యవస్థలో ప్రారంభమవుతుంది. కుటుంబంలోని వ్యక్తులందరూ సంస్కారవంతులైతే తద్వారా ఆ ప్రాంతం, సమాజం చక్కబడతాయి. కానీ ఈ రోజుల్లో స్వార్థపరత్వం పెరిగిపోయి కుటుంబవ్యవస్థకు అర్థం మారిపోతున్నది. ఇటువంటి సమయాలలో కుటుంబవ్యవస్థను సంస్కరించే దివ్య ఔషధంగా రామాయణం ఉపయోగపడుతుంది.

రామాయణంలో సీతారాములు ఆదర్శదంపతులై దాంపత్య జీవనానికి పర్యాయపదాలుగా నిలిస్తే లక్ష్మణుడు ఆదర్శ సోదరుడిగా, హనుమంతుడు స్వామికార్య నిర్వాహణకు ప్రతీకగా నిలిచి మనందరికి ఆదర్శప్రాయులౌతారు. రాముడు ధర్మాన్ని తాను అనుసరించి ఆచరించి మనకు దారి చూపించినాడు. రామాయణం ధర్మాన్ని, ధార్మిక జీవన విధానాన్ని మనకు వివరిస్తుంది. అటువంటి రామాయణాన్ని ప్రతి కుటుంబం ఆదర్శంగా తీసుకుని హిందూదేశం వసుధైక కుటుంబంగా నిలవాలనే తపన రామాయణాన్ని రచించడానికి ప్రేరణగా నిలిచిందని రచయిత్రి వివరించింది. ఆమె ఆశయం నెరవేరాలని, ఈ కావ్యం అందరికి చేరువై, సమాజంలో ఆధ్యాత్మికత వెల్లి విరియాలని కోరుకుంటున్నాను.

ఇష్ట దేవతా ప్రార్థన, సుకవి స్తుతితో ప్రారంభమైన ఈ కావ్యం, ఫలశృతి మంగళం, అంకితంతో ముగిసి కావ్యానికి ఉండవలసిన అన్ని లక్షణాలతో సంపూర్ణ కావ్యంగా అలరారుతోంది. రామాయణ మహాకావ్య రచన లాంటి మహత్కార్యాన్ని సుసాధ్యం చేసుకున్న నా సోదరి మున్నంగి లలితకళ ఎంతో ధన్యురాలు.

రచయిత్రి సింగరాజు వారింట జన్మించి, మున్నంగి వారింటి కోడలై అటు పుట్టినింటికి మరియు అత్తింటికి వన్నె తెచ్చిన విదుషీమణి. ఈమె రాసిన ఇతర గ్రంథాలు కూడా బహుళ జనాదరణ పొంది ఈనాటికి అందరిచేత చదువబడుతున్నాయి. ఈమె రాసే రచనలలో సమాజానికి ఏదో ఒక సందేశం ఉంటుంది.

ఈ రచయిత్రి ఇటువంటి ఎన్నో గ్రంథరాజాలను జన బాహుళ్యానికి అందించాలని, ఈ గ్రంథాలను చదివిన పాఠకులు ఇహలోకానికి పరలోకానికి కావలసిన జ్ఞాన సముపార్జన చేసుకొనేలాగ ఉపయోగపడాలని ఆశిస్తున్నాను.

శతమానంభవతి

స్వస్థి,

ఇట్లు

**సింగరాజు అంబా మల్లేశ్వర వరప్రసాద్ (బాబు)**

ఉమాబాల.

# శ్రీ సీతారాములకు కావ్యాంజలి

ఆదికవి వాల్మీకి విరచితమైన రామాయణం ఆదికావ్యం. దేశ కాల భేదాలు లేకుండా యుగయుగాలుగా తరతరాలుగా మన జీవితాలలో మన సంస్కృతీ సంప్రదాయాలలో మమేకమై మనం ఆచరించవలసిన జీవన విధానాన్ని మనకు నిర్దేశిస్తోంది. రామాయణం అంటే శ్రీరాముడు నడిచిన మార్గం. అది ధర్మమార్గం. ఈ ధరణిపై ధర్మ సంస్థాపన చేయడానికి, మానవుడు ఆచరించవలసిన ధర్మాన్ని, ధార్మిక జీవన విధానాన్ని తాను ఆచరించి, ప్రపంచానికి దిశానిర్దేశం చేయడానికి అవతరించిన మహాపురుషుడు శ్రీరాముడు. అటువంటి శ్రీరామ చంద్రమూర్తి దివ్యమంగళ విగ్రహాన్ని మదిలో స్మరించినా, మధురమైన మహిమాన్వితమైన రామనామాన్ని హృదయంలో ధ్యానించినా, మనస్సు పులకరిస్తుంది. ఆ జన్మ తరిస్తుంది. మరి అటువంటి మహాపురుషుడి దివ్య చరిత్రను తెలిపే రామాయణ మహాకావ్యాన్ని రచించే సంకల్పం కలిగితే ఆ జన్మ ధన్యం అవుతుంది. ఆ జీవితం చరితార్ధమవుతుంది. అటువంటి సంకల్పమే ఆ మహాదేవుడి కృపతో నాకు కలిగింది. రామాయణాన్ని రచించాలనే సంకల్పం. రామచరితను రసరమ్య పదాలతో లిఖించాలనే సంకల్పం.

★ ఈ మహత్కార్యానికి నన్ను సమాయత్త పరచినది కార్యోన్ముఖురాలిని చేసింది శ్రీరామభక్తుడు, చిరంజీవి కుడుపూడి శశిధర్. అతనికి నా శుభాశీస్సులు.

★ ఈ కావ్యరచనలో నాకు సరియైన సూచనలు, సలహాలు ఇస్తూ నన్ను ముందుకు నడిపించినది, పండితులు, కవులు, శ్రీ కడియాల మధుసూదనరావుగారు. వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

★ ఈ కావ్యగానానికి స్వరకల్పన చేసిన గాయనీమణి, విదుషీమణి శ్రీమతి ముదిగొండ మల్లీశ్వరి గారికి నా ధన్యవాదాలు.

★ ఈ కావ్యానికి ముందుమాట రాసినటువంటి గురువర్యులు శ్రీ మైలవరపు లక్ష్మీ నరసింహారావుగారికి నా కృతజ్ఞతాభివందనాలు.

★ నా సోదరులు శ్రీ సింగరాజు అంబా మల్లేశ్వర వరప్రసాద్, వదినగారు శ్రీమతి ఉమాబాల గార్లకు నా ధన్యవాదాలు.

★ నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, నన్ను తమ కుమార్తెలా ఆదరించిన అత్తమామలకు, పైలోకాలనుండి నన్ను ఆశీర్వదిస్తున్న నా పతిదేవునకు, నా సోదరునికి అశ్రుపూరిత నీరాజనాలు.

★ శ్రీ రామాయణ కావ్యరచనలో నన్ను ప్రోత్సహించి నాకు సహకరించిన నా కుమారులు, కోడండ్రు, మనుమలు, మనుమరాండ్రు, బంధుమిత్రులందరికి నా మనఃపూర్వక వాత్సల్యపూరిత శుభాశీస్సులు.

చివరగా, మన ప్రియతమ ప్రధాని శ్రీ నరేంద్రమోదీగారి కృషి ఫలితంగా అయోధ్య రామమందిరం ప్రారంభం కాబోతున్న శుభసమయంలో, విశ్వమంతటా రామనామస్మరణ మారుమ్రోగి పోతూ భక్తుల హృదయాలు ఆనందంతో ఉర్రూతలూగుతున్న ఈ శుభ తరుణంలో నా రామాయణ కావ్యం వెబ్‌సైట్‌లో పొందుపరచ బడటం మహద్భాగ్యంగా భావిస్తున్నాను. రండి.. రామాయణ కావ్య పఠనామృత రసధారలలో తేలిపోయి ధన్యులవుదాం.

ఈ సందర్భంగా పాఠకులకు, ఆ సీతాసమేత శ్రీరామచంద్రుని కటాక్ష వీక్షణాలు అందరిపైనా ప్రసరించాలనీ, ఆయురారోగ్య ఐశ్వర్యాలతో అందరూ వర్ధిల్లాలని కోరుకుంటూ....

**- శ్రీమతి మున్నంగి లలితకళ**

ఓం

గంగణపతయే నమః

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ మాత్రే నమః

శ్రీరామ

# శ్రీ మద్రామాయణము

## బాలకాండము

### ఇష్ట దేవతా ప్రార్థన

శ్రీ వినాయకరార ! శ్రీ కంఠపుత్ర !
సుముఖ విఘ్నేశ్వరా! శుభమీయరార!

శ్రీ రామ కథ నేను శ్రేయస్కరముగ
వ్రాయబూనితినయ్య వరము నీవిమ్ము !

పార్వతీ తనయుడా! పావన చరిత !
విఘ్నాలు రానీకు వినతులు నీకు !

### సరస్వతీ ప్రార్థన

పలుకుల తల్లి నే ప్రణతులన్ సేతు
కార్య జయము నీవు కలుగంగ జేయి !

మదిని మరువనమ్మ! మాతరో నిన్ను
కడవరకెంతయు కరుణతో జూడు !

## పార్వతి ప్రార్థన

శ్రీగౌరి! జగదంబ సేవింతు నిన్ను
రామ గాథా సుధ రమ్యంబుగాను

అందింప బూనితి అందమ్ము లొలుక
సేసలుంచగ రమ్మ! శీఘ్రంబుగాను !

## శివ ప్రార్థన

పరమేశ శితికంఠ! పాదాలు శరణు !
సతతము శశిధర చరణాలు శరణు !

నాగభూషణ! నన్ను నయమున బ్రోవ
నమ్మి కొల్తును నిన్ను నా తండ్రి రార!

హస్తాన నిన్నుంచి అర్పించు నట్టి
భాగ్యమ్ము నాదేను భవములు బాపు

రామాయణాద్భుతరమ్య చరిత్ర
పలువురి ముందుంతు పరమేశ వినుము !

## శ్రీరామ ప్రార్థన

నీలమేఘ శరీర ! నీరజ నేత్ర !
ధర్మమ్ము నిల్పిన ధర్మంపు రాశి

నీదుగాథను నేను నిక్కంపు భక్తి
వినిపింతు నెల్లరకు విశదంబుగాను !

కరుణించి కాపాడు కమలాయతాక్ష !
జానకీ పతి నీవు జగతికే రక్ష!

## జానకి ప్రార్థన

నీలకంఠుని విల్లు నిజముగా ద్రుంచి
నీకు పతిగ నొప్పె నీరజాక్షుండు

జనని జానకి నీకు శతవందనాలు
జనకుని తనయకు శరణాలు వేలు !

మీదు గాథను తెల్ప మేదినీ తనయ
నాకు దీవెనలీయి నా తల్లివీవె !

ఆంజనేయా నీకు హారతులివిగొ !
శ్రీరామ భక్తుడా! జేజేలు చెపుదు !

రామగానము సేతు రావయ్య నీవు !
మా ఇంట కొలువుండ మహనీయరార !

# సుకవి స్తుతి

## వాల్మీకి

కవి కోకిలవు నీవె! కవులకే ఆద్య !
నిన్దల్తు వాల్మీకి నిర్మలంబుగను !

రామ కథాగాన రసమందు దేల్చి
ఊయలూపితి నీవు ఉల్లమ్ములెల్ల

శత వందనాలయ్య సరస కవీంద్ర !
నన్ను దీవింపుమా నతులెన్నొ సేతు !

## మొల్ల

నవరసాలొలికిస్తు రమ్యంబుగాను
కమనీయ పదముల కవితలల్లావు
రమణీయ పద్యాల రత్నాల నెల్ల
ముదమొప్ప ఇలలోన మొత్తమ్ము చల్లి
మనముల నిలచిన మాతల్లి మొల్ల
మనసార మ్రొక్కుదు మరువకనీకు

## బాలకాండము

శ్రీ రఘు వంశాన చిరకీర్తినందె
అవని పాలన చేసె ఆ దశరథుడు

నగరి అయోధ్యను నయమొప్పనేలె
పడతుల ముగ్గుర పరిణయమాడె.

పట్టపు రాణియే పడతి కౌసల్య
కైక సుమిత్రలే గారాల సతులు

సంతానమే లేక సంతాపమందె
పాలించె జనులను పలు వత్సరములు

## పుత్ర జననము

అశ్వమేధము చేసె ఆ మహారాజు
పుత్ర కామేష్టిని పూని చేయగను

దివ్యపూరుషుడే ఆ దివినుండి వచ్చి
పాయస పాత్రను ఫలముగ నొసగె

ప్రియ సతులకు తాను ప్రేమతో నిచ్చె
ముదమొప్ప భుజియించి ముివ్వురు సతులు

వరపుత్రులను బడసి వర్ధిల్లినారు !
రఘుకుల సోముని రాముని తాను

తనయుగా పొందెగా తరుణి కౌసల్య
పుత్రుడై భరతుడు పుట్టె కైకకును

కాంచెను సుమిత్ర కవలల తాను
లక్ష్మణు, శతృఘ్ను లక్షణంబుగను !

వేద శాస్త్రాలను వేడ్కతో నేర్వ
విద్యలన్నిటితోడ వినయమ్ము కూడ

వరుసగా వారిని వరియించెనండి
శూరులు, వీరులు, సుగుణాల ఖనులు

కనులకు విందగు కమనీయులండి
మనసుల మెప్పించు మహనీయులండి

దశరథ పుత్రులు దశమంతులండి
పల్కుల సుధలొల్కు పావనులండి !

వయసేమొ పదునారు వారు పసివారు
కౌశికుడే వచ్చి కౌసల్యసుతుని !

కాచగా జన్నంబు కదలి రమ్మనియె
ముని వసిష్ఠుని మాట మన్నించె రాజు !

తండ్రి అనుమతితో తరలిరి నాడు
రామ లక్ష్మణులెంతొ రమ్యంబుగాను !

'బల', 'అతిబల' మంత్ర బలమును ధార
పోసె వారికి కడు పూజనీయుండు !

పాదాలు చక్కంగ పట్టిరి భక్తి
నడిపించె గురుభక్తి నళినదళాక్షు !

అస్త్రాల తానిచ్చె అసురుల చంప
రక్కసి తాటక రాముచే మడిసె !

వేలాది అసురుల వేగమే చంపి
రక్కసుడు సుబాహు రాపాడి చంపి !

కౌశికు యాగము కాచినాడంట !
అందరి దీవెనలు అందినాడంట !

## వివాహ మహోత్సవము

మేలొనర్చగ తల్చి మిథిలకు చేర్చ
మార్గమునందున మన రాముడపుడు

శాపమే బాపెను సతి అహల్యకును
పతి చేరి తరియించె పడతి అహల్య

జనకుని కొలువలో జనులు మెచ్చంగ
నిటలాక్షు విలుద్రుంచె నీరజాక్షుండు

వేసెను వరమాల వేడ్కతో సీత
పూలవాన కురిసె పుడమి యంతటను

విజయ వార్తను వేనోళ్ల పొగడి
మురిసెను జగమంత ముచ్చటగాను

సురలు ముని వరులు శుభమును పల్క
శ్రీసతి మోములో సిగ్గులే ఒలికె.

అరుదెంచె మిథిలకు ఆ దశరథుడు
జనకుని అతిథియై చక్కంగ నొప్పె.

జనక మహారాజు తనయ ఊర్మిళను
సౌమిత్రి కీయంగ దశరథుని కోరంగ.

కౌశికు నాజ్ఞతో కల్యాణములను
చక్కగా జరుపంగ సమకట్టినారు.

రాజు కుశధ్వజు రత్నాల సుతలు
మాండవీ శృతకీర్తి మంగళంబుగను

భరత శత్రుఘ్నుల పరిణయమాడ
సన్నాహము జరిగె సభలోన అపుడె.

రాముని కల్యాణ రమణీయ గాథ
చెప్ప శక్యము కాదు శేషునకైన.

నా సుత జానకి నమ్మి సేవించు
నిన్ను వీడదు తాను నీడయైయుండు.

అనుచు జనకుడు అవనిజ నిచ్చి
జామాతగా పొందె జగమేలు ఘనుని

ముత్యాల తలబ్రాల ముచ్చట లొలుక
నీలాలుగా మార్చె నేల యల్లుండు

ధరణిజ దోసిట ధగధగ మనుచు
విరిసెను కెంపులై విస్మయమొలుక

ఆ తలబ్రాలను ఆనాడె కాదు
నేటికీ ధరియింత్రు నెరనమ్మి తలను

రామ కల్యాణము రమ్యంబుగాను
వాడవాడల చేసి వాసికెక్కుదురు.

## పరశురామ ధనుర్భంగము

కొడుకులతోను, కోడండ్రతోను
పయన మాయెను రాజు బంధు వర్గముతో

పరశురాముడు వచ్చి వైష్ణవ ధనువు
సంధింపగా కోరె జానకి రాము

శరమునే కాక విష్ణు శక్తిని కూడ
చేకొనె రాముడు జేకొట్టిరంత

సురలు మును లెల్లరు చూడంగ రాగ
జయ జయ ధ్వనులు జగమెల్లనిండె

పుణ్యలోకాలెల్ల పూర్తిగా కరుగ
భక్తితో మ్రొక్కెను పరశురాముడును

మాహేంద్రగిరికి తా మరలి వెళ్ళెనుగ
అందరు ఆ అయోధ్య పురింజేర

పురమెల్ల శోభించె పున్నమివోలె.
పుర జనులెల్లరు పులకించినారు

నోముల పంటలే నూత్న దంపతులు
కనులకు విందుగా కనుపట్టినారు

జననీ జనకులను చక్కంగ కొల్వ
మురిపాల తనయుల ముదమొప్ప జూచి
తనివి తీరగ వారు ధన్యులైనారు

జనులను మెప్పించె జానకీ పతియు
అన్నదమ్ములనగ అవనిలో వారె

వరపుత్రులైవారు వాసికెక్కారు
వీరవరుల గాథ వినుడయ్యమీరు.

బాలకాండము సమాప్తం.

# అయోధ్య కాండము

మేన మామింటికి మిగుల ప్రేమమున
భరత శత్రుఘ్నులే పయనించినారు.

కల్యాణ గుణధాము కౌసల్య కనెను
మధుర భాషియె కాదు మంగళమూర్తి

వినయశీలుడేకాదు వితరణ శాలి
రఘు రాముడాతడు రణధీరుడండి

జానకీ రాములు చక్కని జంట
పతిని సేవించె పడతి సీతమ్మ

అనురాగ మొలికించి అలరించెరాము
ఆదర్శమగు జంట అవనిలో వారు

లక్ష్మణుండేమో సల్లక్షణుండగుచు
అన్నను సేవించె అతి భక్తితోను

మాతా పితరులను మనసారగాను
భక్తితో సేవించు భాగ్యమ్ము బడసి

రామ లక్ష్మణులెంతొ రాణకెక్కారు.
మురిసి దశరథుడు ముదమందినాడు.

తనయుని రాముని తన సమక్షమున
ఆ అయోధ్య పురికి అభిషిక్తు చేయ

తలపెట్టి తాపిల్చె తనదు మంత్రులను
సామంతులను కూడ సంప్రదించాడు.

అంగీకరించిరి వారంత ఏకముగ
తెల్పినా రెంతయొ తేట తెల్లముగ

"మా రాముడే మాకు మహరాజుకాగ
పున్నెమే చేస్తిమి, పుడమిలో మాకు

కొఱతయే లేదింక, కోర్కెలు తీరె"
ఆ మాట వినగనే ఆ మహారాజు

తనయుని రాజుగా తన కన్నులార
కాంచుచు ముదమందు కాంక్షతో తాను

సన్నాహములనెన్నొ చక్కంగ చేసె.
మనసులో మాటను మంగళంబుగను

రాఘవునికి చెప్పె, రాజధర్మములు
బోధించె నయమొప్ప పుత్రునికి తాను.

తండ్రి మాటల నెల్ల తలదాల్చినాడు
మాత కౌసల్య తా మధురమౌ వార్త

విని దీవెనలిడె వీరపుత్రునికి
ఉపవాస దీక్షను ఒసగె గురుండు

సతితోడ రాముడు చక్కంగ వ్రతమును
దీక్షతో చేసెను. దీవించిరంత.

శ్రీరాము రాజుగా చేసేటి వేళ
అందము లొలికెను ఆ పురమంత.

మంథర తెల్పెనీ మంచిదౌ వార్త
సంతసించెను కైక సంగతి తెలిసి.

ఇచ్చెను దాసికి ఇంపైన కాన్క
కోరుకొమ్మనె వరము కోమలికైక.

ఆ మాట వినగనె ఆ మంథరపుడు
మంతనంబులు చేసే మనసు మార్చంగ

రాము సద్గుణములను రమ్యంబుగాను
శ్లాఘించే కైకమ్మ శాంతంబుగాను.

వినలేదు మంథర విరిచెను మనస్సు
రాముడే రాజైన రాణి వాసమున

దాసిగా మారుతూ దశతప్పుతావు.
భరతుడు రాజౌన? భవితలో కూడ

రాజు కాలేడమ్మ రాణిరో! వినవే !
భరతుని రాజుగా పట్టాభిషిక్తు

చేయు మార్గము నీవు చేపట్టుమమ్మ !
వనముల రాముడు వసియింపగాను

వరములే అడుగుము పతి దశరథుని.
దుర్బోధలే చేసె దుష్ట మంథరయు.

చక్కని మనసేమొ వక్కలయ్యెనుగ.
మనసు మారగకైక మండెకోపమున

భరతు రాజుగ చేయపట్టమ్ము కట్టి
వనముల రాముడు వసియింపగాను

మార్గమే చెప్పుమా మంథరా నీవు!
చెల్లగా మనమాట చెప్పవే కుబ్జ !

వెఅవు నెఋగక నే వేసారి నాను.
అనుచు కైకేయి తానడిగె మంథరను

అడిగినంతనె తాను "ఆనాటి అనిలో
అసురు శంబరు నప్డు హతమార్చువేళ

రథము నడిపితివి రాజు ప్రాణములు
కాచితి వీవెగా కైకేయి వినవె.

సంతసించిన రాజు సంతృప్తిజెంది
వరము లీయగ దల్చె వారిజాక్షి! విను

ఆనాటి వరములు ఈనాడు అడుగు
తప్పడాడిన మాట దశరథుడెపుడు

ఈడేరు కోర్కెలు ఇంపలరంగ
వినుమమ్మ నామాట! వెనుదీయకమ్మ !"

అనిన మంథర మాట వినిన కైకేయి
అలుక గృహము చేరె అమిత కోపమున

అంతఃపురము చేరె ఆ దశరథుడు
క్రోధానలముతోడ రోదించు కైక

మాట ఇమ్మనె ముందు మహరాజు నపుడు
శంబరుతో యుద్ధ సమయాన నేను

రథమును నడుపుచు రక్షించినాను.
సమరాన విజయము సమకూర్చినాను.

వరముల నిత్తును వనిత నీకనుచు
మాట ఇచ్చితివెంతో మాన్యుడవీవు.

ఆ వరము లిపుడు అడుగు చున్నాను
భరతుని రాజుగా పట్టము కట్టి

అడవికి రాముని అంపగా వలయు
ఈ రెండు వరముల ఈయగా వలయు.

మాటాడి తప్పితే మహరాజ నీవు
ప్రాణాల విడుతును ప్రాణేశ ! వినుము

ఆ మాటలు వినిన ఆ దశరథుడు
కడు విచారము తోడ కలత జెందాడు

చిత్తంబు కుందగా చేష్టలుడిగెను.
మూర్ఛిల్లె ఆతడు, ముఖకాంతి తరిగె.

కడకెట్టులో లేచి గారాల సతిని
ప్రార్థించెను రాజు ప్రణమిల్లినాడు.

పన్నెను వలతాను పడతి కైకేయి
చిక్కు విప్పగ లేక చింతించినాడు

రాముని సుగుణాలు ప్రవచించెరాజు
తగదిది నీకని తగురీతి దెల్పె.

వినలేదు తనపట్టు విడువనే లేదు.
"మాట తప్పకు నీవు మహరాజు" యనుచు

హెచ్చరించెను సుదతి రెచ్చె కోపమున

దాశరథిని తాను రప్పించె రాజు
వచ్చిన రాముడు వడిగాను వెళ్ళి

తండ్రికి, తల్లికి దండంబులిడెను.
విస్మయంబున జూచె విలపించు జనకు.

కారణమడిగెను కమలలోచనుడు
మాటాడనే లేదు మది విప్పలేదు.

కఠినంపు పల్కుల కసితోడ కైక
వరముల విషయము వైనంగ తెల్పె.

వెనుదీయలేదు తా వెనుకాడలేదు
మాట తప్పకు నీవు మాననీయుడవు

తండ్రి మాటను నీవు తలదాల్చవలయు
వనములందున నీవు వసియింపవలయు

భరతుడు రాజగు పదునాలుగేండ్లు
సమ్మతించెను తల్లి షరతులు వినుచు

నయశాలి రాముడు నగధీరుడండి
వనముల కేగును తన కొమరుడను

తలపుతో రాజెంతొ తల్లడిల్లాడు.
తెలివి తప్పెను రాజు తేరుకోలేదు.

తండ్రికి ప్రణమిల్లి, తల్లికి మ్రొక్కి
కోదండ రాముడు కోర్కెలు విడిచి

వనముల కేగగా పయనమయ్యాడు.
మాత కౌసల్యయయు, మరియు సౌమిత్రి

వనముల కేగగా వలదంచురాము
వారించి నారెంతొ వాదించినారు

"తండ్రిమాటను నేను తలదాల్తునెపుడు
ఆడి తప్పను నేను అమ్మ వినమ్మ"

ఆ మాట వినెతల్లి ఆదరంబుగను
సుతుని దీవించె శుభములు పల్కె

సతి ధర్మములు తెలిపి పతివెంట తాను
పయనమాయెను సీత పతిని ఒప్పించి

ప్రియ లక్ష్మణుడెంతొ ప్రేమ మీరగను
అనుగమించెను తాను అన్న శ్రీరాము.

నార చీరలు దెచ్చె నారికైకయును
వాటిని ధరియించి పయనమైనారు

దశరథు నాజ్ఞతో ధరియించె సీత
ఆభరణములెన్నొ అందంబుగాను.

తల్లుల దీవెన, తండ్రి దీవెనలు
వెంట గొనుచు వారు వీడిరి నగరి.

వెన్నంటి వచ్చారు వేలాది ప్రజలు
తెలుపక వారికి, తెలవారకుండ

అడవి బాటను వారు అనుసరించారు
నగరి అయోధ్యకు నతులు చేయుచును.

దాటిరి పొలిమేర దశరథు సుతులు
చేరిరి గంగను సీతతో కూడ

సేద దీరిరి వారు చెట్టు నీడ.
గుహుడు వచ్చుచు మొక్కె కోయరాజతడు

అర్ఘ్య పాద్యములిచ్చె ఆ భక్తుడపుడు
ఆతిథ్యమిచ్చెను. అతి భక్తితోను.

వినిపించె సౌమిత్రి వివరంబుగాను.
వనవాస దీక్షను వైనంగ దెల్పె.

విన్న ఆగుహుడెంతొ విలపించినాడు
దాశరథి అడిగె దాటింప గంగ

భవముల దాటించు భగవంతు తాను
దాటించి గుహుడెంతొ ధన్యుడాయెనుగ.

తన సుతుడడవికి తరలి వెళ్ళగను
పడతి కౌసల్యయు పతిని నిందించె.

ఆమాట విని రాజు ఈ మాటలనెను.
"పూర్వాన నేనొక్క ముని బాలుడైన"

శ్రావణుడను వాని శరమేసి చంప
అంధులు, వృద్ధులౌ ఆ తల్లిదండ్రులు

పుత్ర శోకము తోడ పొగిలి దుఃఖించి
నాకు శాపంబిచ్చినారు ఆనాడు.

శబ్ద భేదిని విద్య శాపమేతెచ్చె
"పుత్ర శోకము నీవు పొందేవు గాక".

అని శపించిరి అదె పూర్వగాథ.
అంచు తెల్పెను రాజు అతివతో నపుడు.

శోకించె రాజెంతొ క్షోభ జెందాడు
అసువులు బాసెను అంతఃపురాన.

కౌసల్య, సుమిత్రయు కన్నీటి నిడిరి.
మునిగిరి దుఃఖంపు మున్నీట ప్రజలు.

మహరాజు దశరథు మరణవార్త విని
భరత, శత్రుఘ్నులు బహు దుఃఖపడిరి.

వారిరువురయోధ్య వడి వడి చేరి
రాజ్యమ్ము వదలిన రాము సంగతి

వినివిషా దమ్ముతో విలపించినారు.
నిశితంపు పలుకుల నిలదీసె సుతుడు.

జనని కైకేయిని నిందించినాడు.
పిదప భరతుడును పితృదేవునికి

అగ్ని సంస్కారాలు అతి భక్తి చేసె.
"రాజు లేనట్టి ఈ రాజ్యమ్ము నీవు

పాలింప వలెనయ్య భరతుడా రమ్ము
నీ తండ్రి మాటను నిలబెట్టుమయ్యా !"

అనుచు సచివులంత ఆదేశమిడగా
"మహరాజు రాముడే మరి నేను కాదు

అన్నను కొనితెత్తు అవని నేలగను
రాముని ఒప్పించి రప్పింత" మనుచు

భరతుడన్నకడకు పయనమయ్యాడు.
చిత్ర కూటంబును చేరె భరతుడు.

వెదకుచు రాముని వేసారె తాను
పర్ణశాలను చూచి భరతుడుప్పొంగె.

కొలువుండె నచ్చట కోదండ ధరుడు
అవనిజ, సౌమిత్రి అతిభక్తి తోను

సేవింప ముదమందు శ్రీరాము గనెను.
భరత, శత్రుఘ్నులు భక్తిమీరగను

మొక్కి రన్నకు వారు మోకరిల్లారు.
తండ్రి మరణ వార్తతా దెల్పగాను

వినగనె మూర్ఛిల్లె, వెతజెందినాడు..
కడకెట్టులో లేచి కటకట పడుచు

జలాంజలు లొసగె జానకీ పతియు
భరతుడు వేడెను పలుమార్లు తాను

"రాజ్యము పాలింప రమ్మ"నినాడు.
తండ్రి మాటను తలదాల్చవలెగాన

నీవేలు రాజ్యము, నేనుందు నడవి.
మాట తప్పను నేను. మరి మాటలేల?

అన్న రాముని మాట ఆలకించాడు.
అన్నకు దీటైన ఆ తమ్ముడపుడు

"జ్యేష్ఠుడే రాజది శ్రేష్ఠమామాట
నీకు మారుగ నొప్పు నీదు పాదుకలు

రాజ్యమేలును గాక రమ్యంబుగాను".
అని పల్కి భరతుడు అన్న పాదుకలు

తలదాల్చి తమ్ముతో తరలి వెళ్ళాడు.
పాదుకల కతడు భక్తితో మొక్కి

ప్రతినిధిగా తాను పాలించసాగె.
శ్రీరాము డప్పుడు సీతతో కూడి

చిత్ర కూటము వీడి అత్రి మహర్షి
ఆశ్రమంబున చేర అనసూయ చూచి

సీతను ప్రేమతో చేరంగ బిల్చి,
అనురాగముతో దెల్పె అతివ ధర్మములు

అంగరాగములును, ఆభరణములు
ఇచ్చెను కాన్కగా ఇంతి సీతకును

మునుల ఆశీస్సులు ముదమునగొనుచు
రమణియా సీతతో రణ ధీరులప్డు

అడుగిడి నారింక అలసటే లేక
దండ కారణ్యాన ధైర్యముగాను.

అయోధ్య కాండము సమాప్తం

# అరణ్యకాండ

వెడలిన రాముడు, పడతి సీతయును
లక్ష్మణుండా శుభలక్షణుతోడ

అడుగిడె దట్టమౌ ఆవనమందు
అచట కానగ వచ్చె ఆశ్రమము లెన్నొ

అచటి మౌనుల ఆశీస్సులంది
వనమార్గమందున వడివడి నడువ

వికృత విరాధుండు భీతి గొల్పుచును
వచ్చిపైబడియెను రెచ్చెకోపాన

నిశితమౌ శరముల కసితోడవేసి
రామలక్ష్మణుల లప్పుడు విరాధుక్రూరు

సంహార మొనరింప సన్నాహపడుచు
నిశితంపు శరముల నీల్గజేశారు.

మరణింప లేదిటు మాటాడసాగె
"అస్త్రంబు లైనను శస్త్రంబులైన

చంప జాలవు నన్ను చావనునేను
బ్రహ్మ వరంబిదియె బాలకులార !

పడతిని నాకిచ్చి పారిపొండి కను"
క్రోధానపల్కెను క్రూరముగాను.

రక్కసు పల్కులు రాముడు వినుచు
భుజములు ఖండింప భూమిపై బడియె.

అసువులు బాయక అచటనే వుండె
పిడి గుద్దులతొ వారు పిండి చేశారు.

ఎంతకూ మడియని వింత రక్కసుడు
తన శాపంబును తన్ని వారణమును

వినిపించసాగెను వీరవరులకు
"తుంబురుడను నేను తొలి జన్మమందు

ఆ కుబేరుని శాపమంది ఇట్లైతి
నా శాపముడుగు ఖననము చేయ."

అనవిని సోదరుల్ అట్లె కావింప
శాపవి ముక్తుండాయె శాశ్వతంబుగను.

పాపంబు బాపేటి పావనుండతడు
పుణ్యంబు పెంచేటి పూజనీయుండు.

దాటించు భవముల దశరథ సుతుడు
దండకారణ్యాన ధైర్యాన వున్న

మునుల జూచుచు వారు ముందుకెళ్ళారు.
మునులు వేడిరి రాము "ముందుగా ఇచటి

రక్కసుల వధించి రక్షించు రామ !"
అనుచును వారంత ఆర్తితో వేడ

వారి కభయమిచ్చె వారి జాక్షుండు
"రక్షింతు మునులార! రక్షింతు మిమ్ము"

ఘనులగు మునులంత రాఘవునకును
తమ తపః ఫలమును ధారపోశారు

పది వత్సరమ్ములు బాగుగా గడిచె
అయ్యగస్త్యుని వద్ద కరిగినారంత

అమ్ముని వేడ్కతో ఆతిథ్యమొసగె.
వైష్ణవ ధనువును వైభవమొప్ప

అక్షయ తూణీర, మమ్ముల పొదియు,
స్వర్ణ ఖడ్గమ్మును బహుమానమిచ్చె

అసురుల నిర్జింప ఆరామునకును.
అస్త్రాల గైకొని అసురుల చంప

పంచవటికి వారు పయనమయ్యారు.
అరుణుని కొమరుడు ఆ జటాయువును

కాంచిరి వారలు కాననమందు.
దశరథ మిత్రుడా తడు తన కథను

మక్కువ దెల్పెను మహనీయుడతడు
"రక్షింతు మిమ్మనె" పక్షిరాజపుడు

సంతసించిరి వారు సంతృప్తిపడిరి.
అనుజుడు లక్ష్మణుండమిత సుందరుడు

పంచవటీ సీమను పర్ణశాలొకటి
చక్కగా నిర్మించె చాకచక్యముగను.

కొలువుండె నక్కడ కోదండ ధరుడు
గడిపిరి మరి కొంతకా లమచ్చటను

రావణుసోదరి రాముని కడకు
వచ్చె తానప్పుడు వలచెను రాము

చెప్పె తన కథను విప్పె తన మనసు
ఆమె మాటలకెంతొ ఆగ్రహమూని

రాముని తమ్ముడు రయమున వచ్చి
ఖండించె శూర్పణఖ ముకు చెవులను

తెల్పె నా రక్కసి తేటతెల్లముగ
అన్న ఖరునకును ఆరాముగాథ

కుపితుడై ఖరుడెంతొ క్రూరముగాను
రామునొద్దకు వచ్చె రణము చేయంగ

సేనతో వచ్చెను చేరె రఘురాము
క్ష్మాసుత కావలక్ష్మణుడేగ గాను

రాముడొక్కడు తాను రణమునకేగి,
సమరము ఘోరమై సాగె నుగ్రముగ

సురలు గంధర్వులు చూడంగ వచ్చి
"జయమగు రాముకు జయమగుగాక! "

అని పల్కి నిల్చినా రాకాశమందు
పదివేల రక్కసులటు ప్రక్కపోర

శ్రీరాము డొక్కడే చేసే యుద్ధమును
శూరుడు, వీరుడు, సురరక్షకుండు

ఎదిరించె అసురుల ఎంతొ వీరముగ
నిటలాక్షు పగిది నీరజాక్షుండు

రణమున పోరాడె రౌద్రంబుగాను.
ఖర దూషణులను భీకరముగా చంపె

దేవ దుందుభి మ్రోగె దివ్యంబుగాను.
సురలు, మానవులును శోకంబుమాని

“రక్కసి మూకల రాపాడి చంపె.
రక్షించె మనలను రణధీరుడితడు”

అంచు స్తుతించిరి అందాలరాము
పూలవాన కురిసె పుడమియంతటను

“మూడు గడియలలో ముప్పు తప్పించె
వేలాది అసురల వేగమే చంపె

విష్ణువే అతడౌన? వేరొక్కడౌన”
అంచు నుతించిరి అచ్చటి మునులు

సీతతా కొనియాడె శ్రీరామునపుడు
రావణుడు వినెను రాముని జయము

కుమతియౌ నతడెంతొ కుపితుడయ్యాడు
జానకి కొనిపోవ సమకట్టినాడు.

మారీచు జేరి తామంతనమాడె.
“హరిణముగామారి హరిణాక్షి ఎదుట

సంచరింపుము నీవు సంశయింపకుము
నీ రూపు జూచుచు నిను కోరు సీత

ఆశ్రమము వదలి ఆ సోదరులును
నిను వెదకుచు రాగ నేనప్డు వేగ

కొనిపోయి సీతను, కోర్కెను దెల్పి
ఒప్పింతు నామెను ఓడను నేను"

అని చెప్పె దశకంఠుడతి మోహమునను
మారు చెప్పగలేని మారీచుడపుడు

కాంచన హరిణమై కనిపించినాడు
మనసుపడెను సీత, మక్కువతోడ

పసిడి హరిణమును పట్టి తెమ్మనెను
లేడి కన్నుల సీత లేడినికోరె.

"కాదిది హరిణము కపటరాక్షసుడు
మాయలో పడవద్దు మాతరో నీవు!"

అని తెల్పె వదినకు ఆ లక్ష్మణుండు
వినలేదు సీతమ్మ వికటించె విధియు

రాఘవుడప్పుడు రమణి మాట విని
వెడలెను, లేడిని వెంటాడె వేగ

మరిది రక్షణనుండె మగువ ఆ సీత
పరుగిడె మృగమేమొ పట్టుబడలేదు

కనపడి రాముకు కనపడకుండ
చాల దూరము తెచ్చె చతురతతోను.

తుదకెట్లొ లేడిని తునుమాడినాడు
శరమేసి చంపెను సాకేతపతియు

ప్రాణాలు కడగట్ట పడిపోయె లేడి
రాక్షస రూపుతో "రక్షించు నన్ను

హా! సీత! లక్ష్మణా!" యని కేకలిడెను
రాముడరచినట్లు రావంబు వినిన

సీతమ్మ భయపడి చెప్పె మరిదికి
రామునొద్దకు వెళ్ళి రక్షింపు మనుచు

మరిది లక్ష్మణుని తామరి మరి కోరె.
రయమున వెళ్ళగ రమణి కోరింది.

"రాము చంపగలేరు రాక్షసులెవరు
నిను వీడి వెళ్ళిన నీకు చేటగును..."

అని చెప్పె వదినకు ఆ లక్ష్మణుండు
పరుషోక్తు లాడెను పడతి సీతయును.

వినలేక సౌమిత్రి విధిలేక కదిలె
దశకంథరుడపుడు దయమాలితాను

కోర్కెతో సీతను కొనిపోవవచ్చె.
మాయలు పన్నుచు మారువేషమున

తన కోర్కె తెల్పెను దశగ్రీవుడపుడు
పరుష వాక్కులు పల్కెపడతి సీతయును

రాక్షస రూపాన రథపై చేర్చి
ఆకాశ మార్గాన అమిత వేగాన

లంక మార్గము పట్టె లంకేశుడపుడు
పక్షి జటాయువున్ రక్షింపుమనుచు

ఆర్తితో జానకి అర్థించెతాను.
పక్షీంద్రుడప్పుడు బలయుతుడగుచు

రావణుతో పోర రావంబు చేసె
యుద్ధము సాగెను ఇద్దరి నడుమ

హతుడాయె సారథి అరదము విరిగె
ధనువును ఖండించె, ధరణిజ మురిసె.

అలసెను పక్షిరాజలమటించెనుగ
రావణుడప్పుడు రయమున వెళ్ళి.

రెక్కలు ఖండింప ముక్కలాయెనుగ
ప్రాణాలు బిగబట్టి పడిపోయె భువిని

అది చూచి దుఃఖించె ఆ సీత అపుడు
ఆమెను గొనిపోయె అమిత వేగాన

దేవతల్, మునులును దివ్య పూరుషులు
చావు తప్పదటంచు శపియించినారు

ఆ వేగమునకును ఆభరణములు
తళుకులీనుచున్న తారల వోలె.

అవనిపై బడెనవి ఆ దారిలోన.
చేర్చెను లంకకు చెరపట్టినతడు.

రాక్షస లలనల రక్షణ నుంచె.
పాయసమిమ్మని పడతి సీతకును

ఆనతిచ్చెను బ్రహ్మ ఆసురపతికి
అమృత తుల్యమౌ ఆ పాయసమును

తెచ్చి సీతకపుడు ఇచ్చె నింద్రుండు
ఆ పాయసమ్మును భక్షించె సీత

ఆకలి దప్పుల అంతమొందించు
పాయసమదియేను పావనంబౌను.

కాకుత్సుడచట కలవరపడుచు
చేరె నాశ్రమమునకు సీత లేదచట

వెదికిరువురును వేసారినారు.
వనముల గిరులందు వారు చూచారు

కానరాలేదామె కలత జెందారు
పక్షిరాజచ్చట పడివుండగాను

అన్నదమ్ములు జూచి ఆర్తి జెందారు.
జరిగిన కథ చెప్పె జానకీ పతికి

“ఆశ్రమంబున నున్న అవనిజనపుడు
అపహరించుకుపోయె ఆ రక్కసుండు

ఆ రావణుని నేను అడ్డుకొన్నాను
అరదము విరిగెను హతుడాయె రౌతు

దశగ్రీవుడపుడు దబ్బున వచ్చి
నన్నిట్లు పడవేసె నళినదళాక్ష !

గగన మార్గమ్మున కమలాక్షినపుడు
కొనిపోయె వేగాన కౄరరావణుడు.

అని చెప్పి పక్షిరాజసువులు బాసెను.
అంత్యక్రియల జేసె అంత రాఘవుడు

దాటిరి వారపుడు దండకావనము
రక్కసుడొక్కడు రామలక్ష్మణుల

బంధించె, వాడె కబంధ నాముండు
అన్నదమ్ములపుడు అఘోరరూపు

హస్తాల ఖండించి హతము చేయంగ
దివ్యరూపము తోడ దివికేగు వేళ

చెప్పెనీ మార్గమ్ము చెంతకు పిల్చి
"ఋష్యమూకంబున సుగ్రీవుండు కలడు

అతనితో స్నేహంబు అత్యంత శుభము
జగమెల్ల వెదకి జానకి జాడ

కనుగొను మార్గమ్ము కనిపెట్టగలడు
అతడె సుగ్రీవుండు అత్యంత ఘనుడు

కపిరాజు ఆతడు కారుణ్యమూర్తి
అని చెప్పగా వారు ఆనందపడిరి.

పావనమైనట్టి పంపా తటాన
ముని మతంగుడు సమ్మోదంబు నుండు

ఆశ్రమము చేర ఆ సోదరులును
ఎంత కాలము నుంచొ ఎదురు చూచేటి

తాపస్విని శబరి తపము ఫలింప
మధురమౌ ఫలముల మనసార నొసగె.

భక్తితో సేవించి ముక్తినొందెనుగ
చిరయశమును గాంచె చెన్నుమీరగను

కార్యసిద్ధిని కోరికమల లోచనుడు
అనుజుడు సౌమిత్రి అనుసరింపంగ

కనుగొన సుగ్రీవు కదలి వెళ్ళాడు
ఆవనమెంతయో అందాల నొప్పె.

అరణ్యకాండము సమాప్తం.

## కిష్కింధా కాండము

ఆవన శోభను అందాలనెల్ల
వీక్షించి రాముడు విరహమ్ము నందె.

ఓదార్చె సౌమిత్రి ఓర్పుతో అపుడు
కార్యోన్ముఖుండాయె కడకు రాముండు.

వనముల గుహలందు వదలక చూచి
వెదకుచు సీతకై వేసారినారు.

ఆమంతగమునీశు ఆశ్రమమునొద్ద
వసియించుచున్నట్టి వానరాలన్ని

వీరలిరువును వీక్షించి అపుడు
పరెవెత్తెలోనికి భయము జెందుచును

కపిరాజు కాంచుచు కాకుత్స తిలకు
వాలి పక్షము వారు వచ్చినారనుచు

తానెంతో భయమందె తపన పడ్డాడు
మంత్రులతోతాను మంతనాలాడె.

వానర శ్రేష్ఠుండా వాయునందనుడు
శుభము పల్కుచు చెప్పె సుగ్రీవునకును

"వాలి రాలేడిటు వానరరాజ !
భయమొందకు నీవు భద్రమేయగును

అని చెప్ప, సుగ్రీవుడాతని నంప
వాయు సుతుడపుడు వాయువేగాన

మహితాత్ములను చేరె మానవు వోలె
అడిగె నాతడెంతొ ఆతృతతోను.

తెల్పగా తమ కథ తేట తెల్లముగ
సుగ్రీవు గాథను సుమధురముగను

చెప్పెను మారుతి చెలిమి కోరుచును
అన్నదమ్ములపుడు అమితమోదమున

వారి కథను తెల్పి వానరేంద్రునకు
అర్థించి నారపుడు ఆ రాజు చెలిమి.

"వాలితోడను తాను వైరముపూనె.
వాలిని తెగటార్చువారి చెలిమిని

కోరుచుండెను రాజు కోదండరామ !
సీతను వెదకుచు శీఘ్రమ్ముగాను

మీకు సుగ్రీవుండు మేలు చేకూర్చు".
అని చెప్పి హనుమంతుడపుడు

ఇరు భుజమ్ములపైన ఇద్దరిం జేరి
కొనిపోయె నాకొండకొమ్ము మీదికిని

సుగ్రీవు డంతనా సోదరులకును
ఇచ్చె నాతిథ్యమ్ము ఇంపలరంగ

అగ్నిసాక్షిగ వారు ఆప్తులైనారు.
"సీతకై వెదకుదు చింత వద్ద"నుచు

శుభము పల్కెనపుడు సుగ్రీవుడంత.
అతివరుమను వాలి అపహరించాడు

అతనిని చంపి, నా ఆలి రక్షించి
సాయమ్ము మీరలు సలుపంగవలయు

నీరజాక్షి నపుడు నేను పొందుదును.
దక్కును రాజ్యము దశరథసుతుడు!"

అనెను సుగ్రీవుడు ఆ రామునితోను
"వాలిని చంపుదు వానరరాజ !

అభయమిత్తును నీకు అగ్ని సాక్షిగను”
అంచురాఘవుడుతా నభయ మిచ్చాడు.

ఒప్పందము జరిగె ఉభయుల నడుమ
చేతులు కలుపుచు చెలిమి చేశారు.

“క్రూరుడొక్కడు స్త్రీని గొనిపోవగంటి
హోరామ! లక్ష్మణా! యని ఏడ్చుచున్న

పడతి ఆభరణాలు పడవేసె క్రింద
చూచెను నన్ను ఆ సుందరాంగపుడు

ఆమె సీతయేనని అనుకొనుచుంటి
అని తెచ్చె నొకమూట ఆ కపిరాజు

రాముడు గుర్తించె రమణి నగలను
శ్రీరాముడప్పుడు సీతను తలచి

విలపించె నెంతయొ వెతజెందినా డు
“శీఘ్రమే వెదకుము సీతకై నీవు

చంపుదు వాలిని సంశయింపకుము”
చెప్పెను రాముడు చెలికానితోను.

చేరిరి కిష్కింధ, చేయగారణము,
రాముని అండతో రయమున వెళ్ళి

సుగ్రీవు డపుడెంతొ శూరుడై అరచి
కవ్వించె వాలిని కదనము చేయ

భార్య తారప్పుడు పతిమేలు కోరి
వాలికి తాహిత వచనాలు చెప్పె

"రక్షగా నిలచెను రాముడతనికి
రణము చేయగ లేవు రాముతో నీవు

మానుము యుద్ధము మహనీయ నీవు
ఇంపుగా రాజ్యము ఇమ్ము తమ్మునికి."

వినలేదు మాటను వీరుడు వాలి
తమ్మునితో పోరుకు తరలి వచ్చాడు

యుద్ధము జరిగెను ఇద్దరి నడుమ
పోరాడి రిద్దరు పోట్ల గిత్తలన.

బలము క్షీణించెను వాలి తమ్మునికి
సుగ్రీవు రక్షించి శుభము చేకూర్చ

శరమేసె రాముడు శత్రువుపైన
వాలికి తగిలెను వక్షస్థలమ్మున

బాణపు దెబ్బకు పడిపోయె వాలి
ప్రశ్నించె రాముని వానరరాజు

“చాటు నుండిటుల చంపుట తగున?
రాజ ధర్మమిదియ రాజీవ నేత్ర !

నేనేమి చేస్తి నానేరము తెల్పు.”
శ్రీరాముడదివిని చెప్పె వాలికిని

“పరదార తెచ్చితి వదిధర్మమౌన?
ధర్మము తప్పిన దండింప వలయు

నేరస్తు చంపుట నేరము కాదు.”
అని చెప్పె వాలికి ఆ ధర్మమూర్తి

“క్షమియించు శ్రీరామ! క్షమియించు’ మనుచు
నేలకొరిగె నంత నేరమొప్పుకొని.

భర్తను చూడంగ వచ్చె నా తార
విలపించె నాయింతి వేదన జెందె.

అన్న వధకు తాను ఆరాట పడిన
సుగ్రీవుడన్నను చూచి శోకించె.

“వీర ధర్మమ్మును వీడక వాలి
వీర స్వర్గము పొందె వినుడయ్య మీరు

పరితపింప వలదు వానరులార!”
అని తెల్పి రాముడు అంత్యక్రియలను

చేయించె నంగదు చేత వాలికిని
మారుతి కోరెను మహితాత్మురాము.

“రమ్ము కిష్కింధకు రాముడా నీవు
అభిషిక్తు చేయుము ఆ కపివరుని.”

ఆదేశమిచ్చెను ఆ రాముడపుడు
“చొరను నగరమును సుగ్రీవ వినుము.

ప్రస్రవణ గిరినే వసియింతు నేను
రాజువై నీవేలు రమ్యంబుగాను

వర్షాలు ముగియగ పడతి సీతమ్మ
జాడను కనుగొను జాలము వలదు.”

అను రాము మాటల నాలకించాడు.
వానరులను కూడి వైభవమ్ముగను

చేరెను కిష్కింధ శీఘ్రముగాను
అభిషిక్తుడాయెను అక్కపివరుడు

యువరాజుగా చేసె యువకు నంగదుని
శ్రీరాము నొద్దకు శీఘ్రమే వెళ్ళి

సాకేత పతిచేత చక్కంగ నచట
గైకొనె దీవెన కపివరుడపుడు

చేరెను కిష్కింధ క్షేమంబుగాను
కోటరమ్మున నుండె కోదండ ధరుడు

సౌమిత్రి తోకూడి సౌజన్యమూర్తి.
వెతజెందె రాముడు విరహముతోను.

ఓదార్చెతమ్ముడు ఓర్పుతో నిటుల
“వెదకును కపిరాజు వెలది జానకిని

చింతవద్దన్నయ్య! చిత్తగింపవలె.”
అంతః పురము నందు ఆనందమందు

లోకమ్ము మరచు స్త్రీలోలు సుగ్రీవు
మిత్ర కార్యము చేయ మేలు కొల్పంగ

మారుతి సమకట్టి మహరాజు నడిగె.
“సీత నన్వేషించి క్షేమ మరయుచు

మిత్ర కార్యము చేసి మేలొనరించు
సమయము వచ్చెను జాగుసేయకుము

జానకి జాడను చక్కంగ తెలిసి
స్నేహితునకు తెల్ప శ్రేయస్కరమ్ము.

త్వరపడుము నీవు త్వరపడవలె”
అంచు జాగృతు చేసె ఆంజనేయుండు

వినెను సుగ్రీవుండు విశదంబుగాను
అంగీకరించెను ఆ పలుకులకు

అఖిల వానరజాతి నాయత్తపరచి
సీతను వెదకంగ సిద్ధమ్ముగాను

అప్రమత్తము చేయ ఆజ్ఞ ఇచ్చాడు
అధముడా సుగ్రీవుడాడిన మాట

మరచి తాపడి వుండెమత్తుడై ఇంట
సీత నన్వేషింప చేరరాలేదు.

“కటి బిగించుచు మిత్ర కార్యము చేయ
సమకట్ట మనుచును చక్కంగ చెప్పి

సుగ్రీవునకు ధర్మ సూత్రములన్ని
లక్ష్మణా బోధించు లక్షణంబుగను

కార్యసిద్ధి కొరకు కదలి కిష్కింధ
చేరి వారందరి చేరబిల్చుచు

అప్రమత్తుల చేయి అనుజుడా! నీవు
అంచు రాముడు పంపె అనుజు సౌమిత్రిని

చేరెను కిష్కింధ శీఘ్రంబుగాను
కోపాన చెలరేగి కోలాహలమున

చెట్లను పెకలించి చిందర చేసి
భీతిని గొల్పుచు భీకరంబుగను

నగరి ప్రవేశించె నగధీరుడపుడు
వానిని చూచిన వానరులంత

పారిపోయిరి వారు పరువము విడిచి
రాజు సుగ్రీవుకు రయమునవెళ్ళి

తెల్పిరా వార్తను తేట తెల్లముగ
అంగదు నంపను అంతఃపురికిని

సుగ్రీవుకీ వార్త సూచించుమనెను.
పడగలు విప్పిన ఫణి రాజువోలె

భీకర రూపుడై భీతి గొల్పేటి
లక్ష్మణు లాలించి లాఘవమ్మునను

శాంతింప జేయగ సతి తార నంపె.
పంపగ వేగమే పావనుడైన

లక్ష్మణు చేరెను లలితామౌరీతి.
నయమున మెప్పించె నళినదళాక్షు.

మధురమౌ పల్కుల మగువయాతార
క్షమియింప వేడెను చక్కంగ నపుడు

మిత్ర కార్యము మాని మిన్నకున్నట్టి
సుగ్రీవు క్షమియింప సుదతి కోరుచును

సీతను వెదుకగ సేనను పంపె
కోట్లాది వానరులు కోమలిసీత

జాడను తెలియగ జగమంత వెదకి
ఏ లోకమందైన ఎచ్చటనైన

తిరుగుచు వారంత తెల్పుదురయ్య
సీతను గూర్చిన చింతయే వలదు.

జాప్యమునకునీవు క్షమియింపవలయు
కటిబిగించుచు వేగ కదలి వత్తురు

సంశయము వలదు స్వాగతమయ్య
అని పల్కెనాతార అతి మధురముగ

శాంతించె సౌమిత్రి సంతసంబునను.
సుగ్రీవు డెంతయొ సున్నితంబుగను

సాగిలపడి మ్రొక్కి సంగతులెరిగి
తెల్పెనీ పల్కుల తేటతెల్లముగ

శ్రీరాము కార్యము సిద్ధింపజేయ
అఖిల వానర జాతి నాయత్తపరచి

కార్య రంగములోన కదను దొక్కుదుము
వినవయ్య సౌమిత్రి విశదంబుగాను

రావణ వధలోన రామునికేను
అనుయాయినై యుందు అనుమానమొద్దు

మీరు చేసిన మేలు మిత్రమా మాకు
మరువము మేము మా మానసమందు

కాకుత్స గెల్వ కాదెవరి తరమ్ము
రావణు వధియింప రాముడే చాలు

అసహాయ శూరుని అనిలోనగెల్వ
సరివారు లేరయ్య సరసుడా! వినుము

దాసుని క్షమియింపు తప్పులెంచకుము
అనుచును సుగ్రీవుడార్తితో పలుక

వీడెను కోపము వీరవరుండు
రామునొద్దకు నీవు రావయ్య ఇపుడు

రామ కార్యము చేయ రయమున రమ్ము
వేచి యుండె నతడు వేగమే రమ్ము

అని తెల్పె సౌమిత్రి అమిత ప్రేమమున
కోట్లాది వానరుల కొల్లలుగాను

శీఘ్రమే రమ్మనుచు సేనలనెల్ల
అప్రమత్తుల చేసి అమిత వేగాన

వానరసేనతో వానరరాజు
చేరెను రాముని శీఘ్రంబుగాను

ఆతని బిల్చుచు ఆ రాముడపుడు
సీతనన్వేషింప సిద్ధము కమ్ము

జాగుసేయకు నీవు జగదేకవీర
అనిన రాముని మాట ఆలించియపుడు

"వానరసేనలు వరుసగా కదలి
సీతను వెదకును శ్రీరామ వినుము

ఏలోకమందున్న ఎచ్చటనున్న
తిరుగుచు వారంత తెల్పుదరయ్య

సీతను దెత్తుము చింతించవలదు
నలుదిశలకు పంపి నాగబలులను

కొండల, ద్వీపాల, కోనలయందు
సీతను గాలించి శీఘ్రంబుగాను

మంచిదౌవార్తను మహనీయునకును
తెల్పగ రండిక తేనెలొలుకంగ"

అని పంపె సుగ్రీవుడన్ని దిక్కులకు
ఆంజనేయుని తాను అమిత బలాఢ్యు

తారుతో నంపె దక్షిణ దిశకు
వానర రాజప్డు వాయుసుతునితొ

ఇట్లు నుడివెనంత ఇంపలరంగ
"నీటియందైనను నేలయందైన

నింగియందైనను నీకు సమమగు
వేగాన చరియించు వీరులే లేరు

నీ తండ్రి వాయువే నీకు సముండు
నీతి కోవిదుడవు నీవెంతొ బుద్ధి

కుశలుడ వగుటచే గుణవతి సీత
జాడ కనుగొనంగ జగమెల్ల వెదకు

దక్షుడవే నీవు దక్షిణ దిశకు
సాహసమ్మునసేగి సాధింపగలవు.

సాహసమ్మున నేగి సాధింపగలవు
నిన్ను మించిన వారు నిక్కముగ లేరు".

సుగ్రీవు పల్కులు సుధలై సోక,
వాయు సుతుడొకడే వాయువేగాన

కార్యము సాధించు ఘనుడని తెలిసి
సంతసించెను తాను సంతృప్తుడయ్యె.

చేర బిల్చెను తాను సీతకిమ్మనె
రామ ముద్రికననురా గమ్ముతోడ

నా దూతవని సీత నమ్మును నిన్ను,
భద్రముగా దీని పడతి సీతకను

నీవిమ్ము గుర్తుగా నిన్నె నమ్మితిని
సాధించి కార్యము సాహసమ్ముగను

మరలి రమ్మిక నీవు మార్తాండతేజ!"
అని పంపె రాముడు అనిలజునపుడు

రామ ముద్రిక గొని రామబంటపుడు
పయనించె వేగాన పవనుని వోలె !

"నేను దెత్తును సీత నేను దెత్త"నుచు
వానరులందరు వాయువేగాన

బీరములాడుతూ బిరబిరా జనిరి
మాసము వెదకిరి, మరలివచ్చిరిక

రిక్తహస్తాలతో, రేయి పవళ్ళు
కొండల ద్వీపాల కోనలందునను

గాలించినను మాత కానరాలేదు
ఆకలి దప్పుల అన్నింటి మరచి

వెదకితిమి మేము వేసారినాము”
అని చెప్పి వారప్డు ఆ రాముతోను

కారణ జన్ముడు, కనుగొనగలడు
మాతను ఆ హనుమ, మహనీయుడతడు

దక్షిణ దిశకేగె దక్షతతోడ
కార్యము నెరవేర్చి కదలి రాగలడు

అని తెల్పినారంత అతి వినయముతొ
కొండల, గుహలందు కోనలయందు

వనముల బిలముల వానరోత్తములు
గాలించి సీతకై కడకొక్క బిలము

చొచ్చిరి వారెంతొ చోద్యంబుగాను
ఆకలి దప్పుల అలమటించుచును

వెదకుచు నీటికై వేసారినారు
ఆశ వదలిరి వారసువులపైన

కడకెట్టులో లోన కడుగిడగాను
కనపడె సౌధాలు కాంతులతోను

కాంచన భవనాలు కనుల విందుగను
కాంచిరి వారంత కమనీయమైన

ఆకలి తీర్చేటి ఆహారములను
వృద్ధ యోగిని వచ్చి ఋక్ష బిలమున

కాంచన భవనంపు కథసంత తెలిపె
సుందర భవనము సురుచిరముగను

నిర్మించె మయుడెంతొ నేర్పుతోడుతను
అప్సర హేమను ఆతండు వలచె

తెలిసిన ఇంద్రుడు తెగటార్చె మయుని
నలువ హేమ కొసంగె నవ్య భవనము

ఆమె నన్ కాపుంచె ఆ సౌధమునకు
అలసిన మీరు నా ఆతిధ్యము గొని

తెల్పుడు మీ కథ తెరువరులార
అని పల్క యోగిని ఆనందమొంది

ఆతిధ్యమందిరి అమిత ప్రేమమున
ఆంజనేయుడు తెల్పె ఆరాము కథను

వివరముగా చెప్పె వీనుల విందుగ
జానకి న్వెదకి జాడకన్గొనగ

ఆశతో వచ్చితి మమ్మరో వినుము !
ఆకలి తీర్చి మా అసువులు నిల్పి

మమ్ము రక్షించిన మాతవు నీవు
అని తెల్పె మారుతి అంగన కపుడు

కథ విన్న ఆ మాత కపులకు వేగ
తన తపః ఫలమును దార వోయుచును

దాటించె బిలమును దయతోడ నపుడు
ప్రాయోపవేశాన ప్రాణార్పణంబె

గతిమన కంచు అంగదుడు పేర్కొనెను.
ఆంజనేయుడపుడు అంగదునకును

"ప్రాయోపవేశము ప్రాజ్ఞతకాదు
కార్యము సాధింప కదలుడు మీరు

ప్రాణ త్యాగము చేయ ఫలమేమి కలదు?
తలచిన కార్యము తప్పక చేయ

అందరి మన్నన అందుకోగలరు,
సీతను వెదుకగా శీఘ్రమే రండు.

అన్న మారుతి పల్కు ఆలింపలేదు
అంగదు డెంతయో ఆవేదనందె.

సుదతి సీతమ్మున్న చోటు చూడకను
మళ్ళి నట్లైనను మనరాజు మనల

మట్టు పెట్టక తాను మానడు గాదె?
అత్యంత నీచము అటుల మడియుట

ఆత్మార్పణంబది అత్యంత సుఖము"
అంగదు మాటల ఆలించిరంత

సమ్మతించిరి కపుల్ చావబోవగను
రాముగాధను వారు రమ్యంబుగాను

మననంబు చేయుచు మరణము కొరకు
ఎదురు చూచుచు వారు ఏడ్వసాగారు

పక్షిరాజొకడు సంపాతి నాముండు
వారల భక్షింప వచ్చెనచ్చటికి

వినెను రామ కథను వివరంబుగాను
పక్షి జటాయువు పావన గాథ

సంపాతి వినుచు సంచలించాడు
తనకు జటాయువు తమ్ముడే యనుచు

తమ్ముని మనసులో తలచుచు అపుడు
సంతాప మందెను సంపాతి ఎంతో

అంగదునకు చెప్పె ఆ పక్షిరాజు
సీతను గొనిపోయి చెరపట్టె యతడు

లంకలో నుంచెను లంకేశుడనుచు
తమ్ముని జంపిన దశకంధరుండు

రాముచే మడియుట రమ్యంబుగాదె ?
మాట సాయము చేతు మహనీయులార !

వైనతేయుని యొక్క వంశమ్ము మాది
దివ్యవరమే మాకు దివ్యదృష్టియది

దాని సాయమ్మున ధరణిజ చూసి
కార్యము సాధింప కపివీరులార !

కటి బిగింపుడు మీకు కల్గును జయము
ఆ పలుకులు విన్న ఆ కపివరులు

సాగర తీరము చక్కగా చేరి
లంఘించి దీనిని లంకకు చేర

సాధ్యమా మనకది సాహసమ్మౌన ?
అని వితర్కించేటి ఆ కపివరుల

జాంబవంతుడు గాంచి, "జాగుసేయకుడు
వినుడయ్య చక్కగా వేగాన అతడు

వాయుతుల్యుండయ్య ! వాయుపుత్రుండు
అంజనా సుతుడయ్య ! అవలీల జలధి

లంఘింప గలవాడు లాఘవమ్మునను
అతని సాటి ఎవరు? అతుల శ్రేష్ఠుడు

అతిలోక వీరుండు, అమిత బలుండు”
అని జాంబవంతుండు ఆంజనేయుగని

“లేవయ్య వీరుడా! లేవయ్య నీవు
రామ లక్ష్మణులకే రాజసమ్మునను

సరినీవు, సుగ్రీవుసాటి వీరుడవు
సూర్యుని శిష్యుడా! శూరుడా! లెమ్ము

జలధి లంఘింపంగ జగతిలో నీవె
శక్తి యుతుండవు. సత్యమీ మాట”

అనిన పల్కులు విన్న ఆంజనేయుండు
ఆత్మ విశ్వాసమ్ము అలలుగా పొంగ

మేరు నగమ్మును మించినాడపుడు
అద్భుత రూపాన అవతరించాడు.

“జలధినే లంఘింతు, జానకి దెత్తు
వలదు సంశయమిక వలదు మీకనుచు

"నిశ్చింత నుండుడు నేను సాధింతు
జయము మీకగున"ని చక్కగా చెప్పి

మారుతి ఎక్కెను మాహేంద్ర గిరిని
జలధిని లంఘింప సమకట్టినాడు

వానర వీరులు వాయు సుతునకు
జయ జయ ధ్వానాల జయము పల్కారు

సురలు, గంధర్వులు శృతులు కల్పారు.
పూల వాన కురిసె పుడమి యంతటను.

కిష్కింధ కాండము సమాప్తం.

# సుందర కాండము

మారుతి మ్రొక్కెను మార్తాండునకును
వాయు బ్రహ్మల కప్డు వరుసగా మ్రొక్కి

రామ కార్యము నెంతొ రయమున చేయ
జలధిని లంఘింప సమకట్టినాడు

పెంచెను దేహము పెద్ద కొండవలె
మారుతి యప్పుడు మాహేంద్రగిరిని

కరచరణ ములతొగట్టిగా అదిమి
వైనతేయుని వలె వాయు వేగమున

సాగెను ముందుకు సంశయింపకను
రామ బాణము రీతి రయమున వెళ్లి

అంతరిక్షంబునే అవలీల చీల్చి
ముందుకు సాగెను ముక్కంటి అంశ

సురలు గంధర్వులు శూరిని పైన
కుసుమాల వర్షము కురిపించిరపుడు

సాగరుడెంతయొ సదయుడుగుచును
హనుమంతునికి నీవు ఆతిథ్యమిమ్ము

అనుచు మైనాకుని కానతిచ్చాడు
ఆ మాట మైనాకుడాలించి యపుడు

అలసి యుంటివి నీవు అంజనాపుత్ర
గైకొను విశ్రాంతి గమనమాపుచును

పవనుడు నాకగు పరమ మిత్రుండు
రెక్కలు ఖండింప ముక్కలు గాను

వజ్రాయుధముతోడ వచ్చె నింద్రుండు
పవనుడు నన్నప్డు పడవేసె జలధి

భద్రమ్ముగా నుంటి పావని వినుము
మిత్రుని పుత్రుడా మేలు నీకగును

నా శిఖరాలపై నయమొప్ప నీవు
అలసట తీర్చుకో హనుమంతయనుచు

మనసార చెప్పిన మైనాకు పలుకు
ఆలకించుచు చెప్పె ఆంజనేయుండు

ఆనంద మందితి ఆతిథ్యమేను
పొందినట్టుల నీవు పూజ్యుడా మదిని

భావింపు మనుచును పవమాన సుతుడు
మైనాకు వెన్నుతట్టి మనసార నుడివె

సంతస మందితి సంతృప్తి పడితి
నీ ఆదరపు పల్కు నేను మెచ్చితిని

ఆపగ కార్యము అదను కాదిపుడు
అనుచు మారుతి యపుడు ఆకాశవీధి

రివ్వున విహగమ్ము రీతిలో ఎగిరె
పయనించు మార్గాన పవన సుతుండు

ఆటంక పరచెను అతులబలాన
అసుర రూపమ్మున అగుపించె నచట

సురసాఖ్య నాగిని చోద్యంబుగాను
నా నోట జొచ్చుమా నాగ బలాఢ్య

వరము నాకిదియేను వానరోత్తముడ
నూరు యోజనములు నోటిని పెంచి

మ్రింగ బోయె సురస మెల్లిగా అపుడు
పెంచిన దేహాన్ని కుంచించి యపుడు

సంక్షిప్తముం జేసె సమయస్ఫూర్తిగను
అంగుష్ఠ మాత్రుడై ఆంజనేయుండు

సురస నోటను దూరి సుఖముగా వచ్చె
ఆశ్చర్య చకితయై ఆ సురస యపుడు

దీవెన లిచ్చెను దివ్యంబుగాను
ఆటంకములనన్ని అవలీలగాను

అధిగమించుచు తాను అంబరవీధి
రెక్కలు కలిగిన చక్కని నగమై

పయనించ సాగెను పావని యపుడు
రక్కసి సింహిక రామబంటుగని

మంచి ఆహారమ్ము మరినాకు దొరకె
భాగ్యమ్ము నాదేను భక్షింతు వీని

అనుచును సింహిక ఆశతోవచ్చి
ఆతని ఛాయను ఆకర్షణమున

ఒడుపుగా పట్టెను ఓడక తాను
కపివీరుడప్పుడు కంపించినాడు

పెంచెను దేహము పెనుగిరివోలె
దుమికెనా నోటిలో తుదకు

సింహిక నవలీల చీల్చివేశాడు
సురలు గంధర్వులు స్తుతియించినారు

మరల సాగించెను మనకపివరుడు
ఆకాశ వీధిలో అమితవేగాన

పయనించి యప్పుడు పవమానసుతు
ఆవలి ఒడ్డుకు అంతలో చేరె.

భూమిపై దిగగనే భూరియాకృతిని
కుంజర తుల్యుండు కుంచించినాడు

అందాల లంకను అతడు చూచాడు
అమరావతిని బోలు ఆ పట్టణమ్ము

అతి వైభవమ్ముగా అలరారు చుండె
సులభమదియగును సూక్ష్మరూపమున

నిశియందు లంకలో నేనడుగిడెద
సీతకై వెదకుచు శీఘ్రంబుగాను

సాధింతు కార్యము సమయోచితముగ
అని తలచి యతడు ఆరాట పడెను

చంద్రోదయమ్మును చక్కగా గాంచి
అంబర చుంబిత హర్మ్యాల చూచి

చొరలేని సౌధాల చూచుచు అతడు
ఆశ్చర్య చకితుడై ఆ కపివరుడు

అడుగిడె లంకలో అచ్చట నిల్చె
లంకాధిదేవత లంకిణి వచ్చి

ఆంజనేయుని తాను అడ్డగించింది
రావణు నగరము రక్షింతు నేను

సాధ్యము కాదిది సాహసింపకుము
నగరాన చొరలేవు నను జయింపకను

అన్న లంకిణి తోడ ఆంజనేయుండు
పోరాడి విజయము పొందినాడపుడు

ఓడిన లంకిణి ఓర్పుతో ననెను
వీరుడా! శూరుడా ! విజయమునీకు

దశకంధరుడు తాను దశతప్పునింక
చెరపట్టెసీతను చేటు కల్గునింక

మూడెను కాలము ముప్పుతప్పదిక
నలువ చెప్పిన పల్కు నయమొప్పవినుము

కార్యము సాధించు కాలము నీకు
కలిసి వచ్చెను వేగ కపివరా! నిజము.

సీతను వెదకుము స్వేచ్ఛగా నీవు
ఆ పల్కులను విన్న హనుమంతుడపుడు

వెన్వెంట నడుగిడె వేడ్కతో తాను
వామపాదము మోపి వామను వోలె

ఆను పానుల తాను అవలీలగాంచె
రావణాంతః పురము రయమున జొచ్చె

వెదకెను సీతకై వేగము గాను
పలురీతులుగ నున్న పడతులతాను

పరికించి చూచాడు ఫలితములేదు
జానకి కనరాక చాల చింతించె

రక్షింప బడుచుండె రావణు గృహము
రాక్షస సైన్యాలు రథములపైన

అశ్వాలపైనను అలుపెరుగకను
రక్షించు చుండిరి రాత్రింబగళ్ళు

బంగారు ద్వారాలు బహు విధములుగను
రత్నాల తోడను రమణీయముగను

కనుపట్టు చుండెను కనులవిందుగను
అలకా పురము వోలె అలరారుచుండె

వివిధ రూపాల విలసిల్లు స్త్రీల
అంతఃపురములోన హనుమ చూచాడు

కుంభ కర్ణాదుల కోటలంజొచ్చి
శోధించెను హనుమ క్షోభ జెందాడు

రావణు భవనాన రావణుగాంచె
మండోదరిని గాంచి మాత జానకని

తలచెను మారుతి తబ్బిబ్బుపడెను
తరువాత యాతడు తన తప్పు తెలిసి

పరపురుషుని చెంత పవళించదామె
నిద్రింప లేదామె నిజకాంతువీడి

సీత కాదీ కాంత సీత కాదనుచు
భావించి మారుతి భ్రాంతిని వీడె

ఎంత వెదకినను ఎచటనూ సీత
జాడయే తెలియక చాల చింతించె.

మరణించెనేమొ ? మరికానరాద ?
అనుకొని భీతిల్లె ఆంజనేయుండు

పతికై నిరీక్షించు పడతి సీతమ్మ
ఎచటనో యుండులే ఎటులైన వెదకి

సాధింతు కార్యము సమయస్ఫూర్తిగను
ఉత్సాహమును పొందె ఉల్లమందతడు

వెదకని చోటుల వెదకుదు నేను
అనుచు ముందుకు సాగె హరి వీరుడపుడు

రాక్షస గృహముల రమణులగాంచె
సీతను కనలేక చిత్తాన వగచె

విరహ మోపక సీత విడిచెనా తనువు
జలధిలో సీతమ్మ జారెనా ఏమి?

ఎచట నున్నదొ సీత ఏ మాయెననుచు
మనసులో తానెంతొ మథనపడ్డాడు

అయ్యశోకవనిలో అతివను వెదక
పయన మాయెనపుడు పావనితాను

రాలిన పూలతో రమణీయముగను
అందాల రమణియై ఆవని యొప్పె

మధురమౌ ఫలముల మంచి పుష్పాల
నిండిన తరువులు నిల్చెనచ్చోట

అదె అశోక తరువు అచట అగుపడె
రాముకై వగచెడి రమణియా సీత

కనుపించునేమొ ఈ వనమందు నాకు
అగుపడు నిచ్చటి అనుమానమొద్దు.

అని తలచి హనుమ అచట దాగుండె
పరికించి చూచెను పలుమార్లు తాను

ధవళపు కాంతుల ధగధగ మెరయు
ఆకాశ మంతేటి హర్మ్యము చూచె

అచ్చట కూర్చొనె అతివ తానొకతె
మలినమౌ వస్త్రాలు మగువ ధరించె

రాక్షస స్త్రీలంత రక్షించు చుండ
ధ్యానములోనున్న తరుణినిగాంచె

ఆత్మీయులను బాసి అలమటించేటి
అతివను గాంచిన ఆంజనేయుండు

జానకే ననుకొని జగమెల్ల మరచె
రావణాపహృత యారమణి ఈమే లే

ఆభరణములెన్నొ అందములొలుక
తరుల శాఖలకవి తగిలించియుండె.

ఆ నగలన్నియు ఆమెవే యనుచు
ఆ మాత సీతగా భావించె హనుమ

ఆనంద భరితుడై హనుమతానపుడు
అంజలి ఘటియించె ఆ రామునకును

ఆకుల మాటున అతడు దాగుండె
ఆ అశోక వనాన అడుగిడినట్టి

దశకంధరునపుడు తా చూచినాడు
కఠినముగ పలికె కామాతురుండు

బెబ్బులి వలె వచ్చి బెదరించినాడు
నన్ను చేపట్టుమా నళినాక్షి నీవు

పట్టపు రాణివై పడతి నన్నేలు
అనుచు రావణుడెంతొ ఆశ చూపాడు
రావణు మాటకు రమణియాసీత
పరక కంటె నాతడే పరమ హీనుడన

గడ్డిపరక తీసి అడ్డుగా పెట్టి
అదరక బెదరక అతనితోనిట్లు

హితవు చెప్పెను తాను ఇంతియా సీత
"నిక్కంబు రావణా! నిక్కంబు వినుము

మనసు నీవింకను మార్చుకోకున్న
రాముడు తానొచ్చి రయమున నిన్ను

మడియించు ననుమాట మరువకుసుమ్ము
కులకాంత చెరపట్ట కులము నశించు

నీ యింతులందునే నిలుపుకోమనసు"
అని చెప్పెనతనికి అవనిజ తాను

ఆ పలుకులను తాను ఆలింపకుండ
"నా సతివై నీవు నన్నేలకున్న

భక్షింతు నిన్నని భయపెట్టినాడు
"మడియించు డీమెను మాట తప్పినను"

రాక్షస స్త్రీలతో రావణుండనెను
విన్న ఆ సీతమ్మ వెరపు జెందుచును

ఆత్మహత్యకు తాను ఆయత్తపడెను
కలలోన చూచిన ఘటనల కొన్ని

రాక్షసాంగనలకు రమ్యంబుగాను
రాక్షసి త్రిజట తారయమున జెప్పె.

ధవళంపు వస్త్రాలు ధరియించినట్టి
రామలక్ష్మణులెంతొ రమణీయముగను

పల్లకి పైనెక్కి పయనించుచుంట
కలలోన ఇప్పుడు కాంచితి నేను

గజము నారోహించి కాకుత్సుడొచ్చి
పర్వతాగ్రానున్న పడతి జానకిని

చేర దీయుచు తాను జేర్చె అంకాన
పుష్పకమ్మెక్కి యాపూజనీయుండు

ఉత్తర దిశకేగె ఉల్లముప్పొంగ
రావణుండప్పుడు రయమున తాను

పుష్పకమ్మెక్కుచు భూమిపై పడియె
గాడిదపై నుండి గతి తప్పి పడెను.

దశకంఠు మెడలకు తాడు గట్టుచును
లలనయొక్కతె వచ్చిలాగుచునుండె

కుంభకర్ణాదులు కూపాన పడిరి
వకరిపై నెక్కెనుమరి ఇంద్రజిత్తు

ధవళ వస్త్రాలను ధరియించి తాను
ఆ విభీషణుడప్డు ఆకాశవీధి

గజము నారోహించి కనపడినాడు
సాగరమున లంక జారుట నేను

కలలోన జూచితి, కపివరుడొకడు
ఆహుతి చేయుచు అగ్ని దేవునకు

లంకానగరమును లయముచేశాడు
అది విన్న జానకి ఆనందమందె

ఊరట జెందెను ఉత్సాహపడెను
శుభ శకునములెన్నొ సూచితమాయె

వామభుజమదిరె వామాక్షి కపుడు
వామనేత్రంబది వరుసగా అదిరె

సత్ఫలితములెన్నొ సమకూరుననుచు
ముగవ జానకి తాను మదిలోన తలచె

పతిరాకకై చూచు పరమపావనిని
ఆంజనేయుడు గాంచి ఆరాట పడెను.

ఏమి సేయుదు? నేను ఎట్టులోదార్తు?
అదను జూచుచు లంక అనుపానులను

పసిగట్టితిని నేను పడతి సీతమ్మ
దర్శన భాగ్యమ్ము దక్కెను నాకు

ఫలితము చెడకుండ పనిని సాధించి
రాము సందేశమ్ము రమ్యంబుగాను

వినిపింతు సీతకై వేడ్కకలిగింతు
తెల్లవారకముందె తెలివిగానేను

ఎవరికీ కనరాక ఎట్టులో అట్లు
సీతమ్మ తల్లికి చేరి వినిపింతు

అద్భుతమౌగాథ అందమ్ముగాను
తేనె లొలుకు గాథ తేట తెల్లముగను

రామ కథ తెలిపి రమణినోదార్తు
కపివరుడెంతయొ కమనీయముగను

సీతకే వినపడు రీతిలో అపుడు
రామకథను తాను రమణికి చెప్పె

లంఘించి జలధిని లంక చేరితిని
సీత రూపమ్మును చిహ్నమ్ములన్ని

చెప్పగా వింటిని శ్రీరాము వలన
మాత సీతగ నిన్ను మదిలోనవెంచి

చెప్పితి నీ కథ చెలువు మీరగను
అన్న మారుతి మాట విన్న సీతమ్మ

తలను పైకెత్తుచు తరువుపై జూచె
కపివరురూపము కనులార గాంచి

కలగాను భావించి కలవరమందె
కలకాదు నిజమిది కల్లకాదనుచు

ఎరిగిన జానకి ఎదలోన మురిసె
చెట్టు దిగి హనుమ చెంగున దూకి

సీత చెంతకు చేరి స్థిరముగా నిల్చె

అతడు చెప్పిన కథ ఆలించి అపుడు
తన గాథను తెల్పె తరుణి సీతమ్మ

రామ దూతను నేను రమణిరో వినుము
అంచు తెల్ప హనుమ ఆలించె సీత

ఆమె కోరగ తాను ఆ రాము గూర్చి
గుణములు, కథలు, గుర్తులు తెల్పె.

జరిగిన కథనంత చక్కగా చెప్పె
సంపాతి చెప్పిన సంగతి వినుచు

లంకను చేరితి లంకేశు చూస్తి
నిను గూడ గాంచిన నేను ధన్యుడను

అని తెల్పి వేగమే హనుమంతుడపుడు
రామ ముద్రిక చూపె రాముని సతికి

కనులార రాముని కాంచిన రీతి
అనుభూతి పొందెను అతివ సీతమ్మ

కపిసేన తోడ్కొని కాకుత్స్యుడొచ్చి
రావణుసేనను రణమునగెల్చి

నిను గొని పోవును నిజమిదియనుచు
హనుమంతుడెంతయో హర్షముతోడ

ధైర్యము చెప్పెను ధరణిజకపుడు
అదివిన్న జానకి హనుమతో ననెను.

కపట రావణుడేమొ గడువిచ్చెతాను
పండ్రెండు మాసాలు, పది గతించాయి

గడువు తీరక ముందె కాకుత్సుడొచ్చి
దశకంఠువధియించి దరిజేర్చుకొనునొ

లేకున్న రాక్షస లేమలు నన్ను
వధియించి వడిగాను భక్షింతురేమొ

ఆత్మార్పణమె మేలు ఆవధకన్న
అదె శరణ్యము హనుమంత వినుము

అన్న మాతను గాంచి హనుమ ఇట్లనె
వానర సేనతో వడిగాను వచ్చి

రాముడు నిర్జించు రావణు వేగ
నీవాజ్ఞ ఇడినచో నిను గొని నేను

అంతకు ముందుగా ఆ రాము జేర్తు
పతిని జేరుదువమ్మ పదిలమ్ముగాను

మూపుపై కూర్చుండు ముప్పు తప్పింతు
నీరధి దాటించి నినుగొని పోయి

నీరాము నొద్దకు నేను జేర్చెదను
అప్పుడు అవనిజ హనుమతో అనెను.

సూక్ష్మ రూపుడవగు సుతుడవౌ నీవు
సాధ్యామా గొనిపోవ సాహసమొద్దు

సహజ చాపల్యము చాటుకొంటివిగ
అనిన మాటలు విన్న అనిలాత్మజుండు

అవమాన పడుచును అమ్మకప్పుడు
విశ్వరూపమ్మును వీక్షింపజేసె.

తెల్పెద మాతకు తేట తెల్లముగ
బలపరాక్రమములు పలురీతులుగను

అని తలచాడు ఆ అనిలాత్మజుండు
అనల జ్వాలల వంటి అమిత కాంతులతో

తేజరిల్లె నతని దేహమంతయును
నీలాల బోలేటి నేత్రద్వయముతో

మేరు సమానుడై మేను పెంచాడు
లంఘింతు జలధిని లంకనెత్తుకుని

అనుమానమొద్దమ్మ అమ్మ నీకనెను.
జానకి ఇట్లనె జాగుసేయకను

నేనెరుగుదు నయ్య నీశక్తి హనుమ
నీ శీఘ్ర గమనాన్ని నేతాళలేక

జలధిలో పడుదునో జారుతూ నేను
వెంటాడ వారలు వేగంగ మనను

రాక్షసులతో నీవు రణమున నుండ
పట్టు తప్పుతు నేను పడిపోదునేమొ

అంతియే కాదయ్య అతులబలాఢ్య
పరపురుషుని తాక పాడిగాదయ్య

అందరు రిపులను హతమార్చినీవు
నను గొనిపోయిన నా రామునకును

అపకీర్తి వాటిల్లు ఆతడే వచ్చి
అరులను నిర్జింప అదె గౌరవమ్ము

శ్రీరాము నొద్దకు శీఘ్రాన జనుము
నాదు సందేశమ్ము నయమొప్ప జెప్పి

నీవు నా ప్రాణాలు నిలబెట్టుమయ్య
అన్న జానకి తోడ హనుమ ఇట్లనెను.

నీదుకష్టమ్మును నే చూడలేక
దూరము చేయగ నీదు దుఃఖమును

వెఱవు జెప్పితిగాని వేరొక్కటెరుగ
నన్ను మన్నింపుము నతులు నేసేతు

తగిన మార్గము నీవు తగురీతిదెల్పి
నను నడిపించావు నా తల్లి నీవు

శ్రీరాము చేరి నీక్షేమము తెల్పి
వినిపింతు నీమాట విశదంబుగాను

నీకు గుర్తుగ నిమ్ము శ్రీరాముకొసగ
చిహ్నమొక్కటి నీవు చెలువు మీరగను

అది విని అపుడెంతొ ఆనందమంది
కొంగుముడిని విప్పి గుర్తుగ తాను

చూడామణిని తీసి సుందరి సీత
రామునికిమ్మని రామబంటునకు

తన సందేశమ్ము తగురీతి దెల్పి
దశకంఠు దునుమాడ తరలి రమ్మనుచు
దాశరథికి తెల్ప తరుణి కోరింది.

సెలవు గైకొని తాను సీతమ్మ కడను
దశకంఠు సైన్యాల దక్షత తెలియ

కదనమునకు తాను కాలుదువ్వంగ
అయ్యశోకవనిని అమిత వేగాన

నేలమట్టము చేసె నిఖిల వృక్షములు
అతలాకుతలమైన ఆవనిలోన

పూర్వవైభవమెల్ల పూర్తిగా పోయె
రాక్షస స్త్రీలప్డు రావణు చేరి

ఆ వార్త తెలిపిరి అమిత వేగాన
హనుమను బంధింప ఆ రావణుండు

వేలాది రక్కసుల వెంటనే పంపె
రక్కసి మూకను ఒక్కడే చంపె

జయ జయ ధ్వనుల చక్కగా జేసి
రామ దూతను నేను రణమున నన్ను

గెలువగా మీకేమి అలవియే కాదు
గంభీరముగ జెప్పె కపివరుడపుడు

జంబు మాలిని పంపసమరాని కపుడు
ఫరిఘతో తెగటార్చె పవమానసుతుడు

సచివుని సుతులను సమరాన చంప
హనుమంతు చేతిలో హతమార్చబడిన

వీరులం దలచి నిర్వీర్యు డాయెనుగ
సేనా సహితులగు సేనాపతులను

పరిమార్చె నెల్లర పావని అపుడు
అక్ష కుమారుని అనిలాత్మజుండు

రణమున నిర్జించి రాణకెక్కాడు
ఇంద్రజిత్తు, హనుమ ఇరువురు అనిని

ఒకరికి ధీటుగా ఒకరు పోరాడ
మారుతిని గెలుచుమార్గమే లేక

బ్రహ్మాస్త్ర మేసితా బంధించె రిపుని
రాక్షస సేనలు రాము సేవకుని

వల్కలముల తోడ బంధించి వారు
రావణు చెంతకు రయమున చేర్చ

బ్రహ్మాస్త్ర మప్పుడు పట్టు తప్పింది
సచివుల ప్రశ్నకు సమయోచితముగ

రామకథను తెల్పె రామబంటపుడు
మేలు కూర్చు పలుకు మెల్లగా చెప్పె

తథ్యము మడియుట దశకంఠనీవు
ఆ రాము చేతిలో అవలీలగాను

ధర్మ ఘాతికెపుడు తథ్యమ్ము చావు
నిన్ను రక్షింపడు నిటలాక్షుడైన

నీవు తెచ్చిన సీతనీపాలి మిత్తి
నామాట వినవయ్య నయమొప్ప నీవు.

సీతను చేర్చిన శ్రీరాము కడకు
దక్కును ప్రాణాలు దశకంథరుండ

నిర్భయముగ జెప్పె నేరుగా హనుమ
దశకంథరుడపుడు దైత్యులతోను

హతమార్చగ చెప్పె హనుమంతు వేగ
అవ్విభీషణుడప్డు అన్నకు జెప్పె

దూతను చంపుట దురితమేయగును
ధర్మము కాదది ధర్మాత్మ వినుము

దండింపు మీతని తగినట్టి రీతి
అనిన తమ్ముని మాట ఆలించినాడు

రావణు నాజ్ఞతో రక్కసులంత
అగ్నితో వాలము అంటించినారు

వార్త తెలియగనే వైదేహి అపుడు
బాధింప కుండగ పవమానసుతుని

అగ్నిని మనసార అర్ధించె తాను
పర్వతాకారుడై పావని అపుడు

ఆహుతి చేసెను అగ్నికి తాను
లంకా నగరమును లంకేశుడదర

అగ్నికి ఎందరో ఆహుతులైరి
శోకమ్ము తోడ సంక్షుభితులేఐరి.

ఏ మాయె సీతకు ఏ మాయెననుచు
మారుతి మనసులో మధన పడ్డాడు

లంకా నగరమంత లయమాయెకాని
క్షేమముగా నుండె సీతమ్మ తల్లి

జయమయ్య మారుతీ! జయమయ్య నీ
జయ జయ ధ్వానాల జయము పల్కారు

సురలు గంధర్వుల స్తుతియించినారు
మరల వైదేహిని మనసార కాంచి

సంతోషమందెను సంతృప్తిపడెను
శ్రీరాము నొద్దకు చేరగ తలచి

అయ్యరిష్టాద్రిపై అధిరోహితుడయి
ఎగిరెను వినువీధి ఎంతొ ఎత్తునకు

వాయు వేగమ్మున వాయుసుతుండు
ఆవలి ఒడ్డుకు అంతలో చేరె.

హనుమకై చూచెడి అంగదాదులును
సింహనాదము విని శిరము పైకెత్తి

కపివీరు నచ్చట కాంచుచువారు
సంతోష పడిరెంతొ సంతృప్తి పడిరి

అంగదాదులకు తా అతిభక్తి మ్రొక్కె
కంటిని సీతను కనులార నేను

అని చెప్పె వారంత ఆనందమొంద
అచ్చటి విషయాలు అన్నియుతాను

విశదీకరించెను వినయము తోడ
పొంగి పోయిన కపుల్ పొగడినారపుడు

ఆంజనేయుడప్డు అంగదు వెంట
వానరులతో కూడి వాయువేగాన

శ్రీరాము చెంతకు చేరెనుతాను
జరిగిన కథనంత చక్కగా చెప్పి

మాత సీతను కంటి మహనీయులార
సాహసమ్మున నేను సాగరమపుడు

లంఘించి చేరితి లంకకు అనుచు
జరిగిన ఘటనలు జరిగిన రీతి

విషయములన్నియు వివరించి చెప్పె
చూడామణినొసగె సుదతి సీతమ్మ

నీకీయ గుర్తుగా నీరజాక్షుండ
అని చెప్పి మణి నిచ్చె ఆ రామునకును

అంజలి ఘటియించె ఆంజనేయుండు
ఆమణి చూచిన ఆ రాముడపుడు

జానకిని తలచి చాల దుఃఖించె
మారుతీ! వైదేహి మాటలు నాకు

వినిపించుమా నీవు విశదంబుగాను
అనిన రాముని మాట ఆలించితాను

జానకి మాటలు చక్కగా తెల్పె
అనుజుడు సౌమిత్రి అనుసరింపంగ

సుగ్రీవు తోడ్కొని శూరుడా నీవు
వానర సేనతో వారధి దాటి

రావణు నిర్జించి రణమున వేగ
ననుగొని పోవుమా! నళిన దళాక్ష !

వేచియుందును నీకై, వేగమే వచ్చి
ప్రాణాలు నిలుపంగ ప్రార్థింతు నిన్ను

పలికెను వైదేహి పలుమార్లు తాను
నీ పరాక్రమమును నేను వర్ణించి

రాముడు వచ్చి యా రావణు చంపి
నినుగొని పోవును నిజమిదియనుచు

ధరణిజ కెంతయొ ధైర్యము చెప్పి
"దహియిస్తి లంకను దశకంఠుడదర

రక్కసి మూకల ఉక్కడగించి
సీతమ్మ పలుకుల శీఘ్రమే తెల్ప

వచ్చితి నిను చేర వారిజాక్షుండ!”
అని చెప్పి నిలచిన ఆంజేయు గని

“మరువగ లేనయ్య మారుతీ నిజము
నీవు చేసిన మేలు నిజముగా మాకు

ఏమిత్తు నీకిప్డు ఏమివ్వగలను?
అనుచు శ్రీరాముండు ఆదరమ్మునను

హత్తుకొనె ఎదకు హనుమంతునపుడు
ఫలితము దొరుకగా పావని యపుడు

ఉదధియై ఉప్పొంగి ఉత్సాహమందె

సుందరకాండము సమాప్తం

## యుద్ధ కాండము

దుష్టుడా రావణు దురితాలు చూచి
అవ్వి భీషణుడప్డు అన్నను వీడి

రామునొద్దకు వచ్చి ప్రణమిల్లినాడు
దరిచేరి శరణంచు తలవంచినాడు

ఆరాముడంతట ఆశ్రితుకాచి
అభిషిక్తు చేసెను ఆ లంకకపుడు

జలధిని లంఘింప సాధ్యమా మనకు?
అని వితర్కించుచు అబ్ధిని వేడె.

మార్గము చూపగ మనసార కోరె.
జలధిని ప్రార్థించె జగమేలు స్వామి

నలుడను వానరు నాయకత్వమున
వారధి నిర్మింప నీరధి కోరె.

కాకుత్సు నాజ్ఞతో కపిసేన కదలి
సేతువు నిర్మించి సిద్ధము చేసె.

శుభ శకునములెన్నొ సూచితమాయె
రామలక్ష్మణులంత రయమున కపుల

వెంట నిడుకొనుచు వేగమే లంక
చేరిరి రావణు హతుని చేయంగ

చేర్చుము సీతను శ్రీరాము కడకు
మాత కైకసి చెప్పె మరల సుతునికి

ఎంత చెప్పిన కాని సుంతైన వినక
కదనము నకు తాను కాలు దువ్వంగ

అంగదు నంపెను ఆరాముడపుడు
రాయబారమునకు రావణు కడకు

రావణు నాజ్ఞతో రయమున వచ్చి
వధియింపబోయిన వారిని పట్టి

హతమొనరించెను అంగదుడపుడు
రణము తప్పదనుచు రాముడు తలచె

రక్కసి మూకల ఉక్కడగించి
కపులంత ఉగ్రముగ కదలి నారపుడు

అసురులు చెలరేగి  అమిత బలాన
శూలాల పొడి చిరి శూర వానరుల

మేఘనాధుడపుడు మింటిపై నుండి
అగుపడ కెవరికి అస్త్రాల నేసె.

అస్త్రాల ధాటికి అలసిన రీతి
సోదరు లిర్వురు సోలిపోయారు

ముందుగా రాముడు మూర్ఛ తేరాడు
మూర్ఛలో నున్నాడు ముద్దు అనుజుడు

ముంచుకు వచ్చిన ముప్పును దాటు
వెఱవు గానక తాను వెఱపందినాడు.

వైనతేయుడు వచ్చి వారల అస్త్ర
బంధ ముక్తుల జేసి బలమునిచ్చాడు.

ధూమ్రాక్షుని హనుమ తునుమాడినాడు.
పోరది హెచ్చెను ఘోరముగాను

ఇరు వర్గముల మధ్య ఇనుమడించెనది
హనుమ అకంపను హతమార్చినాడు

రావణుండొచ్చి ఆ రామునెదురుగ
నిల్చి గెల్వగ లేక నీల్గినాడపుడు.

మకుటము ఖండించె మన రాముడంత
అలసి యుంటివి నీవు అసురుడా! వినుము.

"నేడు నిన్ చంప, మర్నాడు రమ్మ"నుచు
లంకకు పంపెను లంకేశు నపుడు

జవము కోల్పోయి జంకిన వాడు
కుంభ కర్ణుని తాను కూడ గట్టుకొని

అనికి వచ్చెనపుడు ఆ రావణుండు
భుజములు ఖండించి భూకాంతుడంత

కుంభకర్ణుని తాను కూల ద్రోసెనుగ
ఐంద్రాస్త్రమేసి ఆ దైత్యు చంపె.

రావణు దేసిన ఆంపము వంటి
బల్లెపు దెబ్బకు బలము కోల్పోయి

మునిగెను సౌమిత్రి మూర్ఛలో తాను
వైద్యు సుషేణుని పల్కుతో అపుడు

అనిలజుండు వెడలె అనిలుని వోలె
సంజీవని నగము క్షణములో దెచ్చి

సంతోషమున నుంచె సమర రంగాన
అంత సుషేణుడు అద్రిపైనున్న

మూలికలను నూరి మూర్ఛదేరగను
ముకు పుటముల నుంచె ముందుగా అపుడు

మేల్కొంచె నిద్దుర మేల్కొని నట్లు
లక్ష్మణుండప్పుడు లక్షణంబుగను

మురిసెను రాముడు ముద్దు తమ్ముగని
రఘురామ నెదిరించి రావణుండపుడు

గొప్పగా పోరాడె కొంత కాలమ్ము
దీటుగా నతనిపై దివ్యాస్త్రములను

సంధించె రాముడు సంశయింపకను
అయ్యగస్త్యుండపుడు అమిత ప్రేమమున

అవనిజా పతికి ఆదిత్య హృదయ
మనెడి స్తోత్రమ్మును అచటె బోధించె

బ్రహ్మాస్త్రమేసి ఆ రావణుపైన
మడియించె నాతని మట్టు పెట్టాడు.

సురలు, గంధర్వులు శూర రాముగని
కుసుమాల వర్షము కురిపించి రపుడు

నరులు వానరులు నతులు చేశారు
జగమంత ఉప్పొంగి జయము పల్కింది

విన్న ఆ సీతమ్మ వేడ్క జెందింది
చేర వచ్చు సతికి శీల పరీక్ష

విధియించె రాముడు విధిలేక తాను
అగ్ని పరీక్షకు అవనిజ నిలిచె.

సీతను తోడ్కొని శ్రీరాము కడకు
అగ్ని దేవుడు తెచ్చి అపుడు శ్లాఘించె.

పతివ్రత ఈ మాత పట్టాభిరామ!
శ్రీసతే నీ సతి శ్రీరామ వినుము

ధరణి నేలుము నీవు ధరణిజ కూడి
అని చెప్పి వెడలెను హవ్యవాహనుడు.

ముచ్చటౌ జంటను ముదమార చూచి
జగతియే మురిసింది, జయము పల్కింది

పుష్పక మ్మెక్కి యాపురుషపుంగవుడు
అనుజుడా లక్ష్మణుండను సరింపంగ

వామాక్షి సీతమ్మ వామాంకమునను
ఆసీనయైయుండ, హనుమ దాదులను

వెంట నిడుకొనుచు వెన్వెంట నంది
గ్రామము చేరెను కౌసల్య సుతుడు

భరతుని కోర్కెపై వారెల్లరపుడు
అయ్యయోధ్యను చేర, అచ్చటి జనులు

నిండు పున్నమి నాటి నీరధివోలె
ఉరకలే వేసిరి ఉప్పొంగి నారు.

ముదమార మువ్వురు తల్లుల చేరి
నతులొనరించెను నళినాక్షుడపుడు

సంతృప్తి జెందిరి, సంతుష్టులైరి
దీవెనలొసగిరి దివ్యముగాను

సీతా సహితుడైన శ్రీరామునపుడు
వేద మంత్రములను వేదోక్తముగను

అభిషేకమును చేయ అవ్వసిష్ఠుడును
మణిమయ మగునట్టి మకుటముతోడ

భూషితు చేసిరి భూసురులంత
సింహాసనా శీను శ్రీరాము జూచి

సురలు గంధర్వుల శుభము పల్కారు
పూల వాన కురిసె పుడమియంతటను

ప్రజలంత ఉప్పొంగి ప్రణతులే జేసి
ఆశీస్సులందరి, ఆనందపడిరి.

పదివేల వర్షాలు పాలించె భువిని
పాడిపంటల తోడ వర్ధిల్లె పుడమి

ఆరోగ్య భాగ్యాల అలరిరి ప్రజలు
సత్యము, ధర్మము చక్కగా నడిచె

పుత్రుల పౌత్రుల పొందినారంత
అపమృత్యు బాధలు అసలే లేవు

రామ రాజ్యము వంటి రాజ్యమేలేదు.
అన్నదమ్ములనిన అవనిలో వారె

రామనామము కన్న రమ్యమే లేదు
సీతారాములు చక్కనౌ జంట

శిష్ట రక్షణ చేయ శ్రీవిష్ణుమూర్తి
నాల్గు అంశల తోడ నరరూపుడుగ

శిష్ట రక్షణ చే శ్రీ విష్ణుమూర్తి
నాల్గు అంశల తోడ నరరూపుడుగ

ఇన వంశ సోముడై ఇలను వెలిసెను
శ్రీలక్ష్మి తానేమొ సీతరూపమున

జనకునికి లభించె జానకిగాను
పవనుని అంశతో పావని తాను

దాశరథిని కొల్వ ధరణిలో పుట్టె
సురగణాంశముల వా నరులు పుట్టారు

దుష్ట శిక్షణ తోడ శిష్టరక్షణము.
నేలపై ధర్మము నెలకొల్పినాడు.

యుద్ధకాండము సమాప్తం

## ఫలశృతి

రమణీయ మౌగాథ రమ్యమౌగాథ
కమనీయమౌ గాథ కమ్మనౌ గాథ

శ్రీరాముడును, సీత సిరులివ్వగలరు
వ్రాసిన వారికి వరమిచ్చి బ్రోచు

చదివిన వారిని చల్లంగ చూచు
విన్నవారికి కల్గు వేల శుభములు

పవమాన సుతుడుండు పఠియించు చోట
గ్రహ బాధలను బాపి కాపాడగలడు.

# మంగళం

జయ మంగళ మనరె జానకీ పతికి
శుభ మంగళమనరె సుదతి సీతకును

అనుజు లక్ష్మణునికి అనరె జయమ్ము
భరత శతృఘ్నులకు పల్కుడీ శుభము

మారుతికి నిపుడు మంగళమనరె
సుగ్రీవున కనుడు శుభ మంగళంబు

అవ్వి భీషణునకు హారతులివిగో
మాతలు ముప్పురికి జోతలిచ్చెదము

శ్రీమద్రామాయణము సమాప్తం

ఇతి సర్వం శ్రీరామ చంద్రార్పణమస్తు
సర్వేజనాస్సుఖినో భవంతు

రచన :- **మున్నంగి లలితకళ**

